శ్రీ

శివాభ్యాంనమః

# నవరసకాదంబరి.

ఇయ్యది

తెనాలి గ్రామవాస్తవ్య

మహోపాధ్యాయ

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిచే

విరచితము.



తెనాలి, ఆంధ్ర ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1931.



[వెల 0-12-0.

## OPINION.

I read this book 'Navarasa Kadambari' very carefully and it is written in chaste racy style and the 5th and 6th Form students will be greatly benefited by reading it. I have never come across a better translation of original Sanskrit Kadambari than this and I have no hesitation to recommend this excellent book as a text-book for Matriculation Examination.

Tenali, 4th March 1931.

(Sd.) **D. ChidambaraRao,**
Principal District Munsiff.

బరీ మహాశ్వేతల పరిపూత చరితము భారత సతీమతల్లికల భావ శుద్ధినిఁ జాటుచున్నది. కావ్యము కాంతా సమ్మిత మగుటచే జన సముదయమునకు నింద్రియజయ మను మహా గుణమును మనోజ్ఞంబుగ రుచింపఁ జేయునె రససంపత్తి నా శ్రయించినది. ఇందగు ప్రధానరసము కరుణవిప్రలంభమై నను నద్దాని కంగములుగాఁ దక్కు రసము లన్నియు నిముడ్పం బడి యున్నవి. ఎట్లన? కాదంబరీ చంద్రాపీడులును, మహా శ్వేతా పుండరీకులు ననువారి రతి భావమును సూచించు నెడ శృంగారంబును, దిగ్విజయ ప్రస్తావంబున వీరంబును, పుత్రి శోక సందర్భంబునఁ గరుణంబును, దివ్యపురుష సమావేశంబున నద్భుతంబును, ద్రావిడ వర్ణనంబున హాస్యంబును, మృగయా కోలాహలంబున భయానకంబును, చండికాలయ ఘట్టంబున బీభత్సంబును, శాప కారణంబున రౌద్రంబును, జాబాల్యా శ్రమాది నిరూపణంబున శాంతంబును జూడనగును.

ఇదిగాక, శుకనాస నీతియందు నీతి రహస్యము సవిస్తర ముగా వివరింపఁ బడియెను. చంద్రాపీడుని విద్యాభ్యాస ప్రస్తావ మున విశ్వ విద్యాలయ పద్ధతి వెల్లడింపఁ బడియెను. విరహ సందర్భమునందు వైద్యుతాగ్ని, (విద్యుచ్ఛక్తి) అగ్నిచే వస్త్ర ములను శుద్ధిచేయుట (ఇస్త్రీ) జలధారా యంత్రములు (నీటి కొళాయీలు) మున్నగు వాని వర్ణించుటచే భారత వర్షము లోన చిరకాల సిద్ధమగు నాగరకత ప్రకటింపఁబడి యున్నది.

'బాణోచ్ఛిష్టం జగత్సర్వం' సకల వాఙ్మయంబును బాణుని నోరినుండి వెల్వడియె నను విఖ్యాతి యీగ్రంథ విర

చనమువల్లనే యీమహాకవికి గలిగెను. ఇట్లు సకల వాఙ్మయసారంబును నిముడునట్లు రచింపఁబడిన గ్రంథములోని మహావిశేషములు గ్రంథ విస్తరమగునని యిట నుపేక్షింపఁబడియెను. గాన నాయాయి ప్రస్తావములయందు వాఙ్మయమున గల విశేషములన్నియు నిందు గల వనుట నిక్కము.

ఇట్లు నిష్కాములు పవిత్రేతిహాసమనియు, పతివ్రతలు పతివ్రతా చరిత్రమనియు, నీతివిదులు నీతితంత్రమనియు, రసికజనులు రసకావ్యమనియు నానందించునట్లు సత్కృతి నొనర్చి మానవలోకమునకు మహోపకారము నెఱపిన మహాకవిదగు నుద్యము నెట్లు పొగడనగు? దేశభాషాభ్యసనశీలురకైనను మాతృభాషనుండి యాంధ్రీకరింపఁబడిన భారతాదులు విజ్ఞానదాయకములుగా సంగీకరింపం బడుచుండుటచే మాతృభాషయందు దీనికిదియే సాటియని పొగడ్తగన్న యీగ్రంథ రత్నము నాంధ్రీకరించునెడ నట్లే యిదియు జనసమ్మతమగునని యెంచి తొల్లి దీనిం గాదంబరి యనుపేరనే భాషాంతరీకరించితిని. ఆగ్రంథ మాంధ్రవిశ్వవిద్యాలయాధికారులచే 1932 సం॥ బి. యె. పరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నేర్పఱుపంబడియెను. అది యతి విస్తృతముగా నున్నకతన శృంగారమును, వర్ణనాంశమునుఁ జాలవఱకుఁ దగ్గించి తక్కు రసములను దొలంగనీక, నవరస కాదంబరియను పేర బాలురకు నుపయోగించు శైలినిట్లు సంగ్రహింపబడియెను. శృంగారమత్యధికముగా గల మూలకాదంబరి యందైన నతి సుకుమారములగు భావములు జడివానగాఁ గురిపింపం బడియె గాని

యసభ్యమగు పదమెగాక యట్టి యొక యక్షరమైనఁ జేర్పఁ బడియుండలేదు. అవియు నిందుఁ జాలవఱకు సంక్షేపింపఁ బడియె గావున శృంగార కావ్యమని యెంతమాత్రము సంశయింపఁ బనిలేదు. ముఖ్యమగు విన్నపం బేమనిన, బాలురకు వలయు ముఖ్య గుణములలో నింద్రియజయముకన్న వేరొక్కటి లేదు గానను, నీగ్రంథ మాయుత్తమగుణమునుఁ బోధింపనే యేర్పడియె గానను నిద్దానిని బాల భాషాశిక్షకులని యోగింపఁ బ్రార్థించుచున్నాఁడను.

ఇట్లు,

ము. నాగలింగశాస్త్రి





శ్రీ

శివాభ్యాం నమః.

# నవరస కాదంబరి.

చ. అమృతకరుంబలెం గరుణ హాలహలంబు నెవండు దాల్చెనో
యమరతరంగిణింబలె లయాగ్ని నెవండు ధృతిం ధరించెనో
హిమగిరిబాలఁబోలె భుజగేశ్వరమాల నెవండు పూనెనో
యమర సురాసురేడ్యుఁడగు నప్పరమేశ్వరుఁ డెప్డు బ్రోచుతన్.

## ప్రథమ ప్రకరణము.

---

### శూద్రకరాజచరితము.

---

శ్రీసన్నివేశంబగు మాళవదేశమునందు విదిశ యను నొక్క రాజధాని గలదు. అందు విద్రావితక్షుద్రకుండగు శూద్రకుండను నొక రాజన్యుండు రాజిల్లుచుండెను. అతండు సకలవిద్యలకు గనియు, నిఖిలగుణములకు స్థానంబును, రసికుల కాశ్రయుండునై యుండెను. ఆ రేఁడొకనాఁ డాస్థానమండపము నధిష్ఠించియుండ ప్రతీహారివచ్చి మోకాళ్లు చేదోయిని నేలనూని వినయంబున నిట్లనియె. 'దేవ! దక్షిణాపథంబునుండి యొక చండాలకన్యక పంజరమున నొక్క చిలుకను నిడికొనివచ్చి

వాకిటనిలిచి 'సర్వరత్నంబులకు రత్నాకరంబువిధంబున సార్వ భౌముండె పాత్రుండగు. ఈవిహంగమం బాశ్చర్యకరంబగు జీవరత్నంబనియెంచి దేవరవారి పాదమూలంబునకు గొని వచ్చితిని. రాజదర్శనానందంబు ననుభవింపవేడెదన'ని విన్న వించుచున్నది. ఏలినవారి చిత్తము. అని పల్కి యిన్నకుం డెను.

నావిని యా రాజు కుతూహలంబున సమీపముననున్న రాజుల నవలోకించి 'తప్పేమి? రానిమ్ము. అని యానతిచ్చెను. అంతట ప్రతీహారి యాచండాలకన్యకను లోనం బ్రవేశపెట్టెను. అట్లు ప్రవేశించిన యబ్బాలికామణిని రాజచంద్రుం డవలో కించి తన మనంబున నిట్లు వితర్కించెను.

'ఆహా! తగనిచోట నింతటి చక్కదనము రచిం చిన విరించి నేమనవచ్చును? తన రూపంబున నఖిల రూప సంపద నపహసించు నీమించుబోడిని సృజించినవాఁడు స్పర్శ సుఖంబునకు దగని కులంబునం బుట్టింపనేల? అని చింతించు నారాజన్యు నక్కన్య ప్రౌఢవఁడిక చేతులు జోడించి మణి కుట్టిమంబునం గూర్చుండ దానిచెంతనున్న పురుషుడు పంజ రముతోన చిలుకం బట్టుకొని కొంచెము డగ్గఱి రాజు నుద్దే శించి వినయంబున 'దేవ! సకలశాస్త్రార్థవేదియగు వైశంపా యనుండను నీశుకంబు సకల భూతల రత్నంబగు. దీనిని గ్ర హింప దేవరవారె పాత్రులని యెంచి మా తేని యనుంగు గూఁతురు మీచరణసన్నిధికిం గొనివచ్చెను. దీనిం బరిగ్ర హించి యనుగ్రహింపవలయు' నని యాపంజరము నచట

నునిచి తాను వెనుక కేగెను. అంత విహంగరాజంబు రాజున కభిముఖుఁడయి కుడికాలెత్తి విస్పష్టవర్ణంబగు వాక్కున జయ శబ్దంబు నుచ్చరించి యా రాజు నుద్దేశించి యీపద్యంబుం జదివెను.

గీ. అనఘ! భవదరి కామినీ స్తనయుగంబు
బాష్పమున మున్గి యాహారవాంఛవీడి
హృదయశోకాగ్ని చెంత వర్తించుచుండి
వ్రతము చరియించు నోయన వఱలుచుండు.

భూనాథుం డీపద్యమువిని యచ్చెరువొంది చేరువనున్న కుమారపాలితుండను మంత్రిముఖ్యు నవలోకించి మీరిద్దాని వర్ణోచ్చారణవిస్పష్టతను, స్వరమాధుర్యమును వింటిరిగదా? మఱియు నిది దక్షిణచరణంబు నెత్తి జయశబ్దంబువలికి యీ పద్యంబుజదివెను. ఇది మిక్కిలి యక్కజంబు' అనవిని మంత్రి వర్యుండు చిరునవ్వొలయ రాజు నవలోకించి 'దేవ! ఇందేమి చిత్రము? చిలుకలు, గోరువంకలు మున్నగు పులుగులు వినిన పలుకులు పలుకుచుండును. మఱియు జన్మాంతరసంస్కారం బుననో, లేక పురుషప్రయత్నంబుననో సంస్కారాతిశయంబు గల్గుట యెంతయు వింతగాదు. తొల్లి చిలుకలకు మనుజుల కుంబలె పరిస్ఫుటమగు వాక్కు కలిగియుండెను. ఐనను నది యగ్నిదేవుని శాపంబున భంగమొందెను. అని పలుకుచుండ మధ్యాహ్న శంఖధ్వని వినవచ్చెను.

అది విని రాజు స్నానసమయంబగుట రాజలోకంబు నకు సెలవొసంగి, మాతంగకన్యకను విశ్రమించుమని పల్కి

శుకరాజంబును లోనఁ బ్రవేశపెట్టి స్నానపానాదుల నుపచరిం పుమని తాంబూలకరంకవాహిని కానతిచ్చి యభ్యంతర గృహంబున కరిగి, స్నానకృత్యంబు నిర్వర్తించి మంత్రపూతోదకంబుల సూర్యున కర్ఘ్యంబిడి, పితృతర్పణంబు సేసి, మహాదేవు నారాధించి, అగ్నికార్యంబు దీరిచి, రాజన్యులతో నాహారంబు నిర్వర్తించెను. తరువాతఁ దాంబూలంబు గ్రహించి శయనగృహంబు ప్రవేశించి సుఖశయనం బధివసించి చిలుక వృత్తాంతంబు నెఱుంగవలయునను కుతూహలంబునఁ బ్రతీహారింగాంచి యంతఃపురమునుండి వైశంపాయనుఁడను చిలుకం గొనిరమ్మని యానతిచ్చెను. అప్పు డది చిలుకం గొని వచ్చిన నమ్మహీకాంతుండు శుకంబు నుద్దేశించి అంతఃపురములోన నభిమతమగు నశనంబు నెద్దియేనిఁ గుడిచితే, అనుడు నాచిలుక యిట్లనియె.

దేవా! అంతఃపురంబున నేనారగింపనిదేమి కలదు? కషాయమధురంబగు జంబూఫలరసంబు గ్రోలితి. సింగంపు గోళ్ళం జీల్పఁబడిన మదపుటేనుంగుల కుంభములయందలి రక్తసిక్తంబులగు ముక్తాఫలంబులంబోలు దాడిమీఫలబీజంబు లాస్వాదించితి. ఏదని చెప్పుదు? రాణుల పాణితలంబులనుండి యీఁబడినదంతయు నమృతంబుంబోలియుండెను. అన విని రాజిట్లనియె.

చిలుక! ఇదియంత యట్లుండనిమ్ము. నీవృత్తాంతంబు విన మాకుఁ గుతూహలము గలుగుచున్నది. కాన నామూలంబుగ దెలుపవలయు. నీవేదేశంబున బుట్టితివి? ఎవ్వారీ పేరు

వెట్టిరి? తల్లి యెవరు? తండ్రియెవరు? వేదంబు లెట్లు వచ్చెను? శాస్త్రపరిచయమెట్లు కలిగెను? విద్యలన్నిటి నెవ్విధంబున నార్జించితివి? జన్మాంతరంబునఁ జదివినవాని స్మరించెదవా? వరంబున వచ్చెనా? లేక విహగవేషంబున డాగియుండిన యొక పురుషుండవా? మున్నెందుంటివి? వయస్సెంత కలదు? పంజరమున నెట్లు చిక్కువడితివి? చండాలకన్య చేతికెట్లు చిక్కితివి? ఇచ్చటికి వచ్చుటెట్లు! చెప్పుము. అనుడు శుకరత్నంబు కొంతదడవు చింతించి రాజు నాదరంబునఁ జూచి యిట్లనియె.

---

## ద్వితీయ ప్రకరణము.

### శుక చరితము.

మహారాజ! ఇది గొప్పకథ. విన వేడుకయేని నాలింపుము. వింధ్యారణ్యంబు నడుమ నతిప్రసిద్ధంబగు దండకారణ్యంబునందు నగస్త్యమహాముని యాశ్రమపదంబు గలదు. ఏమునిసార్వభౌముండు మహేంద్రుని ప్రార్థనంబున సకల సాగరజలంబుల నాచమనంబు సేసెనో, ఏజడదారి మేరుమత్సరంబున సూర్యుని రథంబు నిరోధించిన వింధ్యశిఖరి నానవెట్టెనో, ఏతపసి వాతాపిదనుజుం జఠరానలంబున వ్రేల్చెనో, వసుమతీ నేయునహుషుండేనహంకారంబున నహుషుని బవ భ్రష్టుగావించెనో, అట్టి మైత్రావరుణుని గులసతియగు లోపాముద్ర తనంతన పాదులుచేసి దోయిలిచే నుదకంబు వోయుచుఁ బెనిచిన తరువులతో నొప్పుచు నాదివ్యాశ్రమపదంబు

దీపించుచుండును. అచ్చోట సీత పెనిచిన ముసలిజింకలిప్పుడును వర్షకాలంబున గంభీరఘనగర్జారవంబు నాలించి శ్రీరామ చంద్రుని వింటిమ్రోఁతం దలంచుచు శూన్యంబులగు నలుదెస లంబరికించి బాష్పంబులు గ్రమ్మ గటికె దిననొల్లకుండును.

భూవల్లభ! ఆట్టి యగస్త్యాశ్రమంబునకు ననతిదూరంబున విచ్చిన కెందామరలం గాఱుపూదేనియల చంద్రకంబులఁ బెంపొంది, అగాధంబై, యనంతంబై, యప్రతిమంబైన పంప యను తామరకొలనొక్కండు చెలువొందుచుండును. ఆసరసికిఁ బడమటియొడ్డున దండకారణ్యంబున కధిపతిచందంబునను, వింధ్యశిఖరికి సఖునివిధంబునను దీపించు గొప్ప బూరుగమ్రా నొక్కటి కలదు.

దానికొమ్మలయందును, తొఱ్ఱలయందును, నెడము గలదియగుటం జేసి వేలకొలంది గూఁడులం గట్టుకొని, యొక్క నలవిగాని దగుటచే భీతివిడిచి పలుదెసలనుండి వచ్చిన పక్షి కులంబులందు గాపురంబుండును. శుకకులంబు లావృక్షంబునం దమ గూఁడులయందు రేలంగడపి ప్రత్యూహంబునలేచి యాహా రార్థం బాకసంబున బారులుదీఱి వెడలి యందందొదవిన యెరలమె సవి మరలి తమ నీడంబులనున్న పిల్లలకు పలువిధంబులగు ఫల రసంబులను, వరివెన్నులనుం గొనివచ్చి ముకుదొప్పలచే నొసంగుచు సర్వస్నేహంబులకంటె నధికంబగు నపత్యప్రే మంబునఁ దమ శిశువుల తెక్కలసందుల నునిచికొని రేలంగ డపుచుండును. అందొక తొఱ్ఱయందుఁ బత్నితోనుండు నాతండ్రికి వార్ధకంబున నేనొక్కండ జన్మించితిని. నన్నుగను

నప్పుడ ప్రసవవేదనంజేసి నాతల్లి పరలోకమున కేగెను. వార్ధకంబునఁ బ్రాణప్రియ మృతినొందుటంగడు దుఃఖితుండయ్యు మజ్జనకుండు వొంగివచ్చు దుఃఖంబునులోన నిమిడ్చికొని నన్నుఁ బెనుపసుత్సుకుండాయెను. ఏంప్లునిండినవాఁడగుటఁ దిరుగజాలక తక్కుంగల గూడులనుండి క్రిందఁబడిన బియ్యపుగింజలను, పండు చెక్కలనుం గొనివచ్చి నాకిచ్చి యేఁగుడువ మిగిలిన దాని తోన తాను తృప్తివహించుచుండెను.

ఇట్లుండ నొకనాఁడు వేవేలుఁగువొడమి నాలుగు గడియలకాలంబు నతిక్రమించునెడ నక్కాడవియందు సకల వనచరంబుల భీతిగొల్పుచు మృగయాకోలాహలధ్వని వెడలెను. ఏను పుట్టిననాటంగోలె వినియెఱుంగని యారావంబువిని వీనులు బ్రిద్దలగుడు వెఱగుపడి వడంకుచుఁ జేరువనున్న నాతండ్రి ఱెక్కలలోనండాగి నటించుచుంటిని. అంత రభసంబున "ఓరి! ఇదిగో గజయూధంబుమధింప వెడలు సరసిజవనంబుపరిమళము. అదిగో! వరాహకులంబు గొఱికినతుంగము స్తలసుగంధము. ఇదె లేడిగుంవు, అదె అడవియేనుంగుల దండు. ఓగోరి! ఇన్వనంబునం బ్రవేశింపుఁడు. ఈచెట్టుకొన కెక్కుడు. ఈ దెసఁజూడుఁడు. ఈచప్పుడువినుఁడు. విండ్లంగైకొనుఁడు. కుక్కలవిడువుఁడు. అని యొండొకరితోఁ జెప్పికొను జనుల కోలాహలంబు నాకర్ణించితి.

అంత గొంతసేపునకు నక్కలకలం బడఁగి, చిలికిన పిదప నుపశాంతంబైన పాలవెల్లిపడువున నయ్యడవి స్తిమితపడియుండ నేను భయంబుదక్కి కౌతుకంబున మెడసాచి యేమి

యినియని విస్మయంబున నాదెస దృష్టి నిగిడించితి. అంతలో పరిభ్రమించు జము పరివారంబో, భూతలంబు భేదించుకొని వచ్చిన దానవలోకంబో, ఒక్కెడం గూడిన పాపకర్మపుంజంబో నీరంబునమునింగి యందుండి వెడలిన వనమహిషబృందంబో, యనఁ గాననమెల్లఁ జీకటి నించుచు భయజనకంబైన కిరాత సైన్యంబుం గాంచితి.

ఆసైన్యంబునడుమ ప్రథమవయస్సున నుండువాఁడై యతికఠినుండగుట జన్మాంతరగతుండగు నేకలవ్యుండో, వింధ్యుని కొమరుఁడో, కృతాంతు నంశావతారమో, పాపంబు తమ్ముఁడో కలికాలంబుసారథియో యనఁజెల్లు మాతంగ నాముండగు శబరసేనాపతిం గాంచితి. అందొక ముసలిబో యందు తనకు మాంసము లభింపమిం జేసి దానినార్జింపనెంచి కొంతసే పాబూరుగచెట్టు మొదటఁ దడసెను.

ఆబోయదండు మరుగైన పిదప నాముదుకండు మాయా యువులం గ్రోలువాసింబలె కౄరదృష్టితో నాపాదపంబు మొదటినుండి చూచెను. అట్టియెడఁ జిలుకల ప్రాణంబులు పైకిఁబోవుచున్నవో అనునట్లుండెను. రామచంద్రమ! నిష్కారుణులకు దుష్కరమేమికలదు? అతరువు దురారోహం బైనను వాఁడు మెట్లతో నెక్కువగిది నయత్నంబుగ నెక్కి యందు గొన్ని కొన్నాళ్లకుముందె పుట్టియుంట నెత్తురు చాయతో నొప్పి బూరుగపూవులో యను శంకగలిగించునవియు కొన్ని జిల్లేడుకాయలం బోలునవియు, ఇట్లు ఱెక్కలురాక, ఎగయుటకు శక్తిలేకయుండిన చిలుకపిల్లలఁ గొమ్మలసందుల

నుండియుం, తొఱ్ఱలనుండియుం, నొక్కొకదానింబట్టి బిలుకు మార్చి నేలంబడవైచుచుండెను.

అట్టియెడ నయ్యుపద్రవంబు నవలోకించి వడంకుచు మరణభయంబునం గన్నీరునించుచు నక్కాలంబున కదియె ప్రతిక్రియగా నెంచి నన్ను ఱెక్కలసందున మునిచికొని యుండెను. ఆపాపుండు క్రమంబుగ మాతొఱ్ఱయొద్దకువచ్చి ముదిత్రాచుపడగవలె భయంకరంబైన డాచేతిని జాచి ముక్కుచే గొఱుకుచు నఱచుచున్న నాతండ్రినిబట్టి చంపెను. అల్పశరీరుండనగుటను నాయువు శేషించియుండుటను తండ్రి ఱెక్కలలోనండాగియున్న నన్ను గానండయ్యెను. అనృశంసుండు గతప్రాణుండగు నాతండ్రిని తలక్రిందుగం గ్రిందంబడ నైచెను. తండ్రి తనువుతోడ నేనునుంబడుచు నాయువు శేషించుటంజేసి గాలికింగూడియుండిన యెండాకులపైం బడితిని. దానంజేసి నాయంగంబులు భంగంబునొందవయ్యెను. వాడు చెట్టునుండి దిగివచ్చునంతలో వానికింగనంబడక ప్రాణభయంబునకులోనై నృశంసునివోలె తండ్రినివిడిచి, కొంచెమువచ్చుచున్న ఱెక్కలతో నిటునటుంబొరలుచు నెడలి సమీపమున నున్న కానుగుచెట్టు మొదటికిం జేరితిని. పిదప నాయెఱుకువాండా చెట్టుదిగి క్రిందపఱచినట్లు చచ్చిపడియున్న పక్షికూనల నాకులలోనునిచి తీవియలంగట్టి తీసికొనిపోయెను.

అనంతరము బ్రదుకునందాసగొని పితృశోకంబున బొక్కుచు నున్ననాకు మిక్కుటమైన దప్పికలిగెను. అయినను నేనాపాపిష్ఠుండు పోయెనో, లేదో, యనిమెడసాచి దిక్కులం

యినియని విస్మయంబున నాదెస దృష్టి నిగిడించితి. అంతలో పరిభ్రమించు జము పరివారంబో, భూతలంబు భేదించుకొని వచ్చిన దానవలోకంబో, ఒక్కెడం గూడిన పాపకర్మపుంజంబో సిరంబునమునింగి యందుండివెడలిన వనమహిషబృందంబో, యనఁ గాననమెల్లఁ జీకటి నించుచు భయజనకంబైన కిరాత సైన్యంబుంగాంచితి.

ఆసైన్యంబునడుమ ప్రథమవయస్సున నుండువాఁడై యతికఠినుండగుట జన్మాంతరగతుండగు నేకలవ్యుండో, వింధ్యుని కొమరుఁడో, కృతాంతు నంశావతారమో, పాపంబు తమ్ముఁడో కలికాలంబుసారథియో యనఁజెల్లు మాతంగ నాముండగు శబరసేనాపతిం గాంచితి. అందొక ముసలిబో యండు తనకు మాంసము లభింపమిం జేసి దానినార్జింపనెంచి కొంతసే పాబూరుగచెట్టు మొదటఁ దడసెను.

ఆబోయదండు మరుగైన పిదప నాముదుకండు మాయూ యువులం గ్రోలువాసింబలె కూరదృష్టితో నాపాదపంబు మొదటినుండి చూచెను. అట్టియెడఁ జిలుకల ప్రాణంబులు పైకిఁబోవుచున్నవో అనునటులుండెను. రామచంద్రమ! నిష్కరుణులకు దుష్కరమేమికలదు? ఆతరువు దురారోహం బైనను వాఁడు మెట్లంతో నెక్కుపగిది నయత్నంబుగ నెక్కి యందు గొన్ని కొన్నాళ్లకుముందె పుట్టియుంట నెత్తురు చాయతో నొప్పి బూరుగపూవులో యను శంకగలిగించునవియు కొన్ని జిల్లేడుకాయలం బోలునవియు, ఇట్లు రెక్కలురాక, ఎగయుటకు శక్తిలేకయుండిన చిలుకపిల్లలఁ గొమ్మలసందుల

నుండియు, తొఱ్ఱలనుండియు, నొక్కొకదానింబట్టి బిలుకు
మూర్ఛ నేలంబడవైచుచుండెను.

అట్టియెడ నయ్యుపద్రవంబు నవలోకించి వడఁకుచు
మరణభయంబునఁ గన్నీరునించుచు నక్కాలంబున కదియె
ప్రతిక్రియగా నెంచి నన్ను ఱెక్కలసందున నునిచికొని
యుండెను. ఆపాపుండు క్రమంబుగ మాతొఱ్ఱయొద్దకువచ్చి
ముదిత్రాచుపడగవలె భయంకరంబైన డాచేతిని జాచి
ముక్కుచే గొఱకుచు పఱచుచున్న నాతండ్రినిబట్టి చంపెను.
అల్పశరీరుండనగుటను నాయువు శేషించియుండుటను తండ్రి
ఱెక్కలలోనండాగియున్న నన్ను గానఁడయ్యెను. ఆనృశం
సుండు గతప్రాణుండగు నాతండ్రిని తలక్రిందుగఁ గ్రిందఁబడ
వైచెను. తండ్రి తనువుతోడ నేనుఁబడుచు నాయువు శేషిం
చుటంజేసి గాలికింగూడియుండిన యెండాకులపైఁ బడితిని.
దానంజేసి నాయంగంబులు భంగంబునొందవయ్యెను. వాఁడు
చెట్టునుండి దిగివచ్చునంతలో వానికింగనఁబడక ప్రాణభయం
బునకులోనై నృశంసునివోలె తండ్రినివిడిచి, కొంచెమువచ్చు
చున్న ఱెక్కలతో నిటునటుఁబొరలుచు వెడలి సమీపమున
నున్న కానుగుచెట్టు మొదటికిఁజేరితిని. పిదప నాయెఱుకు
వాఁడా చెట్టుదిగి క్రిందపఱచినట్లు చచ్చిపడియున్న పక్షికూనల
నాకులలోనునిచి తీవియలంగట్టి తీసికొనిపోయెను.

అనంతరము బ్రదుకునందాసగొని పితృశోకంబున
బొక్కుచు నున్ననాకు మిక్కుటమైన దప్పికలిగెను. అయినను
నేనాపాపిష్ఠుండు పోయెనో, లేదో, యని మెడసాచి దిక్కులం

గనుచు నందుండి వెడలి జలసమీపంబునకుఁ బోవ యత్నించి
తిని. ఱెక్కలురామిని, తిరంబుగ నడుగువెట్టలేమినిఁ బలు
మాఱు బోరగిలంబడుచు లేచుచు "బుడమింబొరలుచు నలవు
గొని మోరపైకెత్తి బెట్టునిట్టూర్పులవిడుచుచుండ నటకుగొంత
దూరంబుననున్న జాబాల్యాశ్రమమునుండి యతని కొమరుం
డగు హారీతుండు సమానవయస్కులగు కొందఱు మునిపుత్రు
లతో పంపాసరసికి స్నానార్థమరుగుచు నామార్గమునవచ్చెను.

తఱుచుగ సజ్జనులమనంబు లకారణమిత్రంబులు, నతి
దయార్ద్రంబులునగు, ఆ హారీతముని యట్టియవస్థలోనున్న
నన్నుగాంచి సమీపవర్తియగు నొకమునికుమారునితో ఓయి!
ఈచిలుకపిల్లంగంటివా? ఇది ఱెక్కలురానిదె యీచెట్టుకొన
నుండి క్రిందఁబడినది. లేకున్న శ్యేనముఖముననుండియైనఁ
గ్రిందఁబడియుండవలయు. ఇద్దానియాయువు కొంచెము సేపులో
నున్నది. కనులు మూయుచున్నది. నోఱు దెఱచుచున్నది.
కావునఁ బ్రాణంబుపోకమున్నె దీనింగొనిరమ్ము. నీటిచెంత
నిలుపుము. అనిపలికి నన్నుఁగొలనికిం దెప్పించి నీటిచేఱువం
గూర్చుండి, యొక్కచోఁ గమండలు వునిచి నన్నుబట్టుకొని
యప్రయత్నంబున నోఱుఁబైకెత్తిననన్నుఁ దనవ్రేలితోఁ
గొన్నిజలబిందువులు ద్రావించెను. పిదప నీటందడిసి తెలివి
వచ్చిననన్నుఁ జల్లనియొక తామరాకునీడనునిచి తాను స్నాన
ముచేసి ప్రాణాయామంబుగావించి సూర్యునకర్ఘ్యంబిడి వెలి
నారచీరంగట్టి కమండలువున జలంబునించికొని మునికుమారుల
తోడ నన్నుంగొని తపోవనంబునకుఁ జనియెను.

# తృతీయ ప్రకరణము.

## జాబాల్యాశ్రమగమనము

---

అచ్చట నగ్నుల వేల్చువారును, హరిహరుల నర్చించు
వారును, ధర్మశాస్త్రముల నాలోచించువారును, జపమాలి
కల ద్రిప్పువారును, మంత్రముల సాధించువారును, యోగ
మునభ్యసించువారును నగు మునివరులతో నొప్పి, కలికాల
మును జూడకయు, అసత్యంబు పరిచయములేకయు, అనంగుని
వార్త వినకయు రెండవ బ్రహ్మలోకంబుంబోలు నాశ్రమంబు
గాంచితి. ఆదివ్యాశ్రమంబునడుమ నశోకతరుతలంబునం
గూర్చుండి యత్యుగ్రతపశ్శాలురగు మహర్షులతోఁగూడి
కులాచలంబులతోఁగూడిన కనకశైలంబో, అగ్నులతోఁగూడిన
క్రతువో, భాస్కరులతోఁగూడిన కల్పాంతదివసంబో యన
నొప్పుచున్న భగవంతుండగు జాబాలిమహర్షిం గాంచి మనం
బున నిట్లు వితర్కించితి.

"ఆహా! తపంబుల ప్రభావంబేమి? ఈ రూపంబు శాం
తంబయ్యు మెఱుంగుభాతిగన్నుల మిఱుమిట్లు గొల్పుచున్నది.
మహామునుల నామగ్రహణంబులె పాపక్షయకారణంబులగు
ననుచో నిఁక వారి దర్శనంబునకు ఫలంబేమి చెప్పవలయు?
ఈ యనఘుండు కరుణారసంబునకుఁ బ్రవాహంబును, సంసార
సాగరంబునకు సేతువును, క్షమకునాధారంబును, తృష్ణాలతకు
గొడ్డలియు, సంతోషామృతంబునకు సాగరంబును, సిద్ధి

మార్గమునకు నుపదేష్టయు, ఉపశమతరువునకు మూలంబును, ధర్మధ్వజంబునకుఁ బ్రాసాదంబును, సకల విద్యలకుఁ దీర్థంబును శాస్త్రరత్నంబులకు నొఱగల్లును, మోహాంధకారమునకు సూర్యుండును, ఆచారంబులకు వాస భవనంబును, మంగళము లకు నెలవును, కలికాలంబునకు వైరియు, తపంబులకు నిక్క యు, సత్యంబునకు సఖుండును నై యున్నవాఁడు. ఇమ్మహా త్ముని ప్రభావంబున నెతిర్యగ్జంతువులును సహజ సిద్ధంబగు వైరం బుం ద్యజించి తపోవనవాస సుఖము ననుభవించుచున్నవి. ఆహా! అచట సర్పమెండకుఁ దలఁకి నెమ్మి పింఛమునీడ వసిం చుచున్నది. ఇచటఁ గపికులంబు సహజ చాపలంబు విడిచి స్నానము సేసిన మునికుమారకులకు ఫలములఁ గొనివచ్చి యిచ్చుచున్నది" అనియేను చింతించుచుండ హారీతుండు నన్ను రక్తాశోక తరువునీడ నునిచి తండ్రి పాదార విందంబు లకు వందనం బాచరించి యటనున్న కుశాసనమునం గూర్చుండెను.

అచ్చటిమునులు నన్ను గాంచి దీని నెచ్చటఁ గొనివచ్చి తివని హారీతునడిగిరి. ఇతండును వారినవలోకించి 'యీ చిలుక కూన చెట్టుమీఁదినుండి క్రిందఁబడి యెండకుడస్సియుండఁ గాంచి దానిం గూటిలోనునుచుట కావృక్షమెక్కరానిదగుటం జేసి కని కరంబున నిటకుం గొనివచ్చితి. కావున ఱెక్కలువచ్చునందాక యిందగు వృక్షకోటరముననుండి మునికుమారులొసఁగు ఫల రసంబులచేఁ బ్రాణంబుల ధరించుఁగాక. అనాథపరిపాలనంబె మనబోంట్లకు ధర్మముగదా? అని నావృత్తాంతంబుఁ జెప్ప

చుండ నాలించి జాబాలిమునీంద్రుండు కుతూహలంబునఁ
బుణ్యజలంబులచేఁ గడుగునోయన నన్నుఁ బ్రశాంతదృష్టిచేఁ
గాంచి "ఇది తన యవినయ ఫలంబు ననుభవించుచున్నది."
అని వచించెను. కాలత్రయవేదియగు నమ్ముని చంద్రుండు
తపః ప్రభావంబున గలిగిన దివ్యదృష్టిచే సకలంబు నెఱుంగు
వాఁడగుట నమ్మాటవిని తాపససంఘుంబంతయు "ఈ చిలుక
యెట్టి యవినయము నాచరించెను; ఎందులకుఁ జేసెను ? ఈ
జన్మమందా ? పూర్వజన్మమందా; అని తెలిసికొను కుతూహ
లంబున జాబాలింగాంచి "ఈచిలుక యేవిధమగు నవినయంబు
ఫలం బనుభవించుచున్నది? ఇది జన్మాంతరమున నేదిగానుం
డెను ? పక్షిజాతియం దెట్లు జన్మించెను? దీని పేరేమి? నీవు సక
లాశ్చర్యంబులకు జన్మక్షేత్రంబవు, కాన మాకుతూహలం
బపనయింపుము" అని ప్రార్థింప నమ్మునిసార్వభౌముండు
వారల నవలోకించి యిది యాశ్చర్యకరంబగు గొప్ప వృత్తాం
తము. మనకు స్నానసమయం బతిక్రమించుచున్నది. కావున
లెండు, మాధ్యాహ్నిక కృత్యంబుం దీర్చికొనిన యనంతరము
మీకు . మొదటినుండి యిదియెవరో ? తొలిపుట్టువున నెట్టి
యవినయంబు సేసెనో ? ఈ లోకంబున నెట్లు జన్మించెనో ?
ఇదంతయుఁ దెలిపెదను. దీనికి నాహారంబొసఁగి బడలికనపన
యింపుడు. ఏఁ జెప్పుచుండ నియ్యది తనజన్మాంతర వృత్తాం
తంబు విని స్వప్న వృత్తంబుంబలె స్మరింపం గలదు. అని
చెప్పుచునె మునులతో లేచి యాహ్నికంబు దీర్చికొనియెను.
అంతలో సూర్యుండస్తాద్రి కేగెను.

## చతుర్థ ప్రకరణము.

### తారాపీడ చరిత్రము.

---

రాజేంద్రా! అప్పుడు ప్రదోషవాతంబులు వీచుచుండ నాలుగుగడియల రేయి గడవగా హారీతుండు కృతాహారుండ నగు నన్నుంగొని యందఱు మునులతో నొక వేత్రాసనంబు నం గూర్చుండియున్న జనకు నుపలక్షించి, తండ్రీ! సకలమగు ముని చక్రంబును జిలుకవార్త విను కుతూహలంబున నిరీక్షిం చుచున్నది. ఈ చిలుక కూన విశ్రాంతి నొందెను, కావున నిదితొల్లిటిజన్మమున నెవఁడై యుండెనో తెలుపు, మని వేడిన నమ్మౌని తిలకుం డెదుటనున్న నన్నుఁగాంచి మునులందఱు శ్రవణాసక్తులగుటం దెలిసి మెల్లగ నిట్లనియె.

ఇది గొప్పకథ. ఇందు గుతూహలము కలదేని నాక ర్ణింపుడు. అవంతీదేశంబున ముల్లోకములకు నలంకారంబై కృతయుగంబునకుఁ బుట్టినిల్లన నుజ్జయినియనునగరి శోభిల్లును. అప్పురి ముల్లోకంబులఁ బుట్టింపను, బెంపను, ద్రుంపను గార ణుండైన ప్రమథనాథుండు తానుండుటకు రెండవపుడమిం బుట్టించెనోయన నొప్పుచుండును. మఱియు నియ్యది రెండవ పుడమియను శంకచే జలనిధిచేఁ జుట్టుకొనఁబడియెనోయన నగ డ్తచే నొప్పుచుండును, ఇందుఁ బశుపతి వసించుచున్నాఁడను ప్రేమంబున వెండికొండ చుట్టుకొని యుండెనోయనఁ బ్రాకా రం బప్పురిఁజుట్టుకొనియుండును. అప్పుర రాజంబు భగవంతుఁ

డగు మహాకాలుని శిరంబున నెలకొన్న మిన్నువాఁకంగాంచి యసూయ నొందెనోయనఁ దరంగ భ్రుకుటితో నొప్పిన శిప్రా నదిచేఁ బరిగతప్రాంతంబై యుండును. మఱియు నానగరి మేడలచే శైలములతోఁ గూడెనోయనగను, సత్పురుషులచేఁ గల్పవృక్షములతో గూడెనోయనగను నమరావతిని మించి దీపించుచుండును. పలుమాటలేల ? సురాసుర బృందవందిత చరణారవిందుండును, భగవంతుఁడునగు హిమగిరి తనయా ప్రాణవల్లభుండు కైలాసవాసంబున బేర్మివిడిచి మహాకాల నామంబున నిందెల్లప్పుడును వసించుచున్నాఁడు.

ఆపుటభేదనంబునందు భరత భగీరథ ప్రతిముండును, ఉత్సాహసంపన్నుండును, గాంతిని సూర్యచంద్రులకు మూఁడవవాఁడో, ధర్మంబు నవతారమో, పురుషోత్తమునకు ప్రతినిధియోయనఁ బరిహృతప్రజాపీడుండగు తారాపీడుండను రాజన్యుండు రాజ్యంబు సేయుచుండెను. ఆ రాజేంద్రునకు నిఖిల శాస్త్రపారంగతుండును, ధైర్యంబునకు నెలవును, సత్యంబునకు నిక్కయు, గుణరత్నంబులకు సాగరుండును, శేషాహివోలె సకల మహీభార ధారణక్షముండునునగు శుకనాసుండను విప్రవర్యుండు మహేంద్రునొద్ద బృహస్పతివలెను, దశరథునకు వసిష్ఠుని విధంబునను మంత్రి ముఖ్యుఁడై యుండెను. ఆరాజశశాంకుండు బాల్యంబుననె సకలవసుంధరాచక్రంబు జయించి, మిత్త్రనియందుంబలె నాశుకనాసునందు రాజ్యభారంబునిచి, ప్రజలను సుస్థితులను గావించి కర్తవ్యశేషంబుగానక యెలప్రాయంబు సుఖంబనుభవించుచుండెను. అతం

డతిరమణీయంబులు, నభిమతంబులు, నవిరుద్ధంబులు నగు భోగంబుల నొందుచు బహుకాలంబునకుఁ దఱుచుగ సకలమగు జీవలోకసుఖము గడఁగాంచెను. కాని పుత్త్రముఖకమల దర్శనసుఖంబు నెఱుంగఁడయ్యె. జవ్వనంబతిక్రమించుకొలఁది. విఫలమనోరథుండగు నాపుడమిఱేనికి నపుత్త్రతచేఁ గలిగిన సంతాపంబు పెంపొందుచుండెను. విషయసుఖవాంఛ చిత్తంబున నత్తమిల్లెను. పెక్కురాజులతోఁ గూడియుండియు నసహాయునివలెను, కన్నులుగలిగియుండియు నంధునివలెను నపుత్త్రికుండగు తన్నుఁ దానెంచుచుండెను. ఈరాజచంద్రునకు హారజటాకలాపంబునకుఁ జంద్రలేఖవలెను, చందురునకు వెన్నెలవలెను, కొలనికిఁ దమ్మివలెను నలంకారంబైన విలాసవతియను విలాసిని సకలవిలాసంబులకు జనని యోయనఁ బట్టపుదేవియై యుండెను.

ఒకనాఁడా రాజు విలాసవతీ భవనంబున కరిగియందుఁ జింతాక్రాంతంబైన పరిజనంబుంగూడి, వృద్ధాంగన లూఱడింపఁ గన్నీరు గార్చుచు సొమ్ములఁదాల్పక డాచేతిపై మోముదమ్మి నునిచికొని మంచంబుపైఁ గూర్చుండి వగచుచున్న కాంతారత్నంబుం గాంచెను. అంతఁ దనకుఁ బ్రత్యుత్థానంబు సేసిన నక్కాంత నామంచంబుపైఁ గూర్చుండఁ బనిచి తానును గూర్చుండి కన్నీరునించుటకు గతంబు దెలియక వెఱఁగుపడి చెక్కులనుండి జాఱు గన్నీరు తన కరతలంబునం దుడుచుచు, “దేవి! శోకభరంబు నడంచుకొని ముత్తియంబులం బలె గన్నీరు దొఱంగ నిశ్శబ్దంబుగ రోదనం బొనర్చెదవుఁ

గతంబేమి? కృశోదరి! అలంకరించుకొనవేల? ప్రసన్నవగుము. శోకనిమిత్తంబు దెల్పుము. ఏనేదేని నేరము సేసియుంటినా? లేక పరిజనంబొనర్చి యుండెనా? నాజీవితము రాజ్యంబును నీయధీనముకదా? దుఃఖ కారణంబు సెప్పుము.” అని పలుమఱు వేడినను నాయమ మాఱుపలుకకున్న నంతఁ బరిజనంబు నడి గెను. అప్పుడు విలాసవతి యడపకత్తె మకరిక యిట్లనియె.

“దేవ! దేవరవారివలన లోపములేదు. దేవరవారు సుముఖులై యుండఁ దప్పొనర్పనెంత నేరికి శక్తిగలదు? మఱి యేమన, ఏలినవారి సమాగమంబు విఫలంబాయెనను గొప్ప సంతాపంబున నీదేవి తపించుచు స్నానభోజనాదులయందుఁ బరిజనుల ప్రేరణంబున నెట్టకేలకు దుఃఖంబుతోడన ప్రవర్తిం చునదియై మీఁదెఱుఁగంబు నొచ్చునని యెంచి విచారంబు వెలి బుచ్చకుండెను. నేఁడు చతుర్దశియని మహాకాలదేవునిఁ బూ జింప నరిగి యచట మహాభారతము పఠించుచుండ “అపుత్రి కులకు గతిలేదు. ఉత్తమలోకంబులునులేవు. పున్నామంబగు నరకంబున నుండి గాచువాఁడుగాన, బుత్త్రుండనం బఱఁగు” ననుమాటల నాలించి యింటికి విచ్చేసినదియై తన్నుఁ బరిజనం బెంత వేడినను నాహారంబు గ్రహింపదు. భూషణంబులఁ దా ల్పదు. మాఱుపల్కదు. ఎల్లపుడును గన్నీరు నించుచున్నది. ఇదియ వృత్తాంతము” అని చెప్పి మిన్నకుండెను.

అంత నాభూకాంతుండు కొంతదడవు చింతించి నిట్టూ ర్పువిడిచి దేవి! దైవాధీనమగు నీవిషయంబున నేమిసేయ నగు? చింతిల్లకుము. తొల్లిటిజన్మంబున శుభకర్మంబు సేయ

మైతిమి. తొలిజన్మంబునఁ జేయుని కర్మంబీజన్మంబున నెట్లును ఫలంబిడ నేరదు గదా? ఎంతవాఁడైనను దైవంబుమీఱఁజాలునే? మనుష్యయత్నంబున నెంతవట్టు సేయ శక్యమగునో, అది యంతయు నొనరింపుము. గురువులయందు భక్తినధికంబుగ నిలుపుము. దేవపూజ రెండింతలు సేయుము. ఋషిజనంబులఁ బరిచరింపుము. దేవతలను ఋషులను యత్నంబున నారాధింప, వారు దుర్లభంబులగు వరంబులనైన నొసంగుదురు. తొల్లి మగధదేశమున బృహద్రథుండను రాజు చండకౌశికుండను మునీంద్రుని యనుగ్రహంబున జనార్దనునిజయింపజాలు పరాక్రమంబుగల జరాసంధుఁడను పుత్త్రినిం బడసెను. దశరథుండును ఋశ్యశృంగుని ప్రసాదంబున నప్రతిహాతులగు నల్వురు కొమరులంగాంచెను. మునిజనసేవ యమోఘంబు. అపుత్త్రితంగలుగుశోకంబు నన్నును రేలుంబవళ్లు గారించుచు నేయున్నది. నాకీజగంబు శూన్యంబుగాఁ దోచుచున్నది. నాజీవితంబు రాజ్యంబును నిష్ఫలంబనితలంచెద. ప్రతివిధానంబు లేని విధివిషయంబున నేమి సేయనగు? శోకంబువిడువుము. ధైర్యంబునను, ధర్మంబునను మనంబు నునుపుము. ధర్మపరుల కెల్లసిరులును సమీపముననుండునని యూఱడించి కొంతదడ వందుండి యటనుండి వెడలెను.

అంత నవ్విలాసవతి శోకవేగంబు విడిచి యెప్పటియట్ల సొమ్ముల నలంకరించుకొని దివసకృత్యంబు నెఱవేర్చెను. అది మొదలుకొని దేవతారాధనముల యందును, గురుజన శుశ్రూషలయందును నధికమగు నాదరంబు వహించి యెల్ల

వ్రతములం జేయుచుండెను. పరిశుద్ధమైన వెలిచీరంగట్టి చండి కాలయమునం బ్రాణాచారంబు పడియెను. రత్నఖచితంబులగు హేమపాత్రంబులయందు నూవులనించి యయ్యవి విప్రుల కొసంగెను. సిద్ధాయతనంబుల సేవించెను. ప్రసిద్ధంబులగు తీర్థంబుల మునింగెను. అశ్వత్థము మున్నగు వనస్పతులకుం బ్రదక్షిణము సేసెను. వృద్ధపరంపరాగతములగు పెక్కు రహస్యముల నాచరించెను. పుణ్యకథల వినియెను. ఓషధులం గట్టుకొనియెను.



పంచమ ప్రకరణము.

॥ చంద్రాపీడ జననము. ॥



ఇట్లు కాలంబుగడచుచుండ నొకనాఁడా భూమీశుండు నిశావసానంబున నాడ యేనుంగు నోరం దామర తూఁటికడియము ప్రవేశించు వడువున మేడమీఁదనున్న విలాసవతి ముఖంబునం బూర్ణచంద్రుండు ప్రవేశించినటులు గలగాంచి మేల్కాంచి సంతసంబున నప్పుడు శుకనాసుం బిలిపించి యాస్వప్న వృత్తాంతంబు సెప్పెను. ఆ మంత్రి పుంగవుండు విని యానందంబునొంది దేవ! చిరకాలమునుండి మాకునుం బ్రజలకును గల మనోరథంబులు సిద్ధించెను. కొలఁది దినములలోనె దేవరవారు పుత్త్రిముఖావలోకన సుఖము నిస్సంశయముగ నొందఁగలరు. ఇప్పుడేనును స్వప్నంబున నుదికిన వెలివలువం

గట్టుకొని యొక జన్నిగట్టు మరందబిందు సందోహంబు గురి యు దెలిదమ్మిం గొనివచ్చి మనోరమ తొడపై నునిచి నటులు గంటిని. శుభనిమిత్తంబులు రాగల యానందముం దెలిపెడిని. పుత్త్రముఖావలోకనంబు దక్క మనకానంద కారణంబొండేమి కలదు ? వేకువం గనిన కలలు తఱచుగ సఫలంబులగు. కావున దేవేరికి మాంధాతవోలె సకల రాజర్షి ధురంధరుండును లోకానంద కరుండునగు కొమరుండు పుట్టంగలఁడు” అని నుడువుచు శుకనాసుం జేయివట్టుకొని రాణివాసంబున కేగియుర్వరుండు గన్న కలల తెఱఁగు విలాసవతికిం దెలిపి యాయమ నానందింపఁ జేసెను.

అంతఁ గొన్నిదినంబులు గడచిన దేవతాప్రసాదంబున సరసి చంద్రప్రతిబింబంబుం ధరించునట్లు విలాసవతి గర్భంబు ధరించి పారిజాతంబుచే నందన వనరాజవలెఁ బ్రకాశించెను. నానాఁటికి గర్భంబు వృద్ధిబొందిన కొలఁది జలపూర్ణంబగు మేఘమాల పగిది మెల్ల మెల్లన సంచరించెను. ఆవులింతలతో నాయాసంబుగ నిట్టూర్పు విడుచుచుండెను. పానభోజనంబుల నొల్లకయున్న యన్నాతిం గని యింగితజ్ఞలగు పరిజనంబు లివ్వి గర్భచిహ్నంబులని యెఱింగిరి. తరువాతఁ గ్రమంబుగఁ బ్రసవ సమయంబు పూర్ణంబగుడు శుభదినంబున జ్యోతిషికులు పాదచ్ఛాయలచే గడియలు లెక్కించుచుండ మంచి లగ్నంబున విలాసవతి పుత్త్రునింగనియెను. అత్తఱి వేగంబుగఁ బరిజనం బిట్టునట్టు బరుగిడుచుండగను, రాజునొద్దకుఁ గంచుకి గణంబు పఱుచుచుండగను గొప్ప సందడి ప్రవర్తిల్లెను. అప్పుడు మంద

రంబుచే మథింపఁబడు జలనిధి ఘోషంబు ననుకరించు దుందుభిధ్వానంబుం బురస్కరించుకొని మృదంగ శంఖ కాహళనినాదంబులచే నిబిడంబయిన యుత్సవకోలాహలంబున సామంతులు ప్రజలును హర్షాతిశయంబున నర్తనంబు చేసిరి. చంద్రోదయంబునఁ గడలి వృద్ధిఁ బొందునట్లు రాజసూనుని జన్మంబున నుత్సవంబు వృద్ధిఁగాంచెను.

అంత నప్పార్థివుండు పుత్రముఖ దర్శనంబునకు డెందంబు త్తలపాటునొందుచున్నను, జ్యోతిషికులచే నుపదిష్టంబగు ప్రశస్తముహూర్తంబునఁ బరిజనులనెల్ల వారించి శుకనాసుండు మాత్రము తోడరా మంగళ దీపంబులచే దీపించుచున్న పురిటిల్లుం గాంచి జలము నగ్గిని స్పృశించి లోనఁ బ్రవేశించెను, అచటఁ బ్రసవవశంబునఁ గృశించియున్న విలాసవతి తొడమీఁదఁ దన కాంతి పుంజంబున దీపకాంతుల నిరసించుచు, గర్భాగారంబు విశదముం జేసి "ఉదయకాలంబున నెఱ్ఱనైన సూర్యబింబంబో సంధ్యాసమయంబున లోహితంబైన చంద్రబింబంబో, వికసించిన కెందమ్మి మొత్తమో, పుడమింజూడ నేతెంచిన యంగారకుండో, సురవనితల కరంబులనుండి జాఱిపడిన యింద్రకుమారుండో, యనఁదనరి, సహజభూషణంబులో యన నొప్పారు మహాపురుష లక్షణంబులతో భాసిల్లుచు నాహ్లాద జనకుండైన తనయుంగాంచెను. అప్పుడా రాజవరేణ్యుం డానంద బాష్పంబులు గ్రమ్మఁ బుత్రముఖంబుఁ గనుఱెప్ప వ్రేయక కాంచి సంతసించుచుఁ దన్నుఁ గృతకృత్యునిఁ గా నెంచెను. అయ్యెడ శుకనాసుండు బాలకు నంగోపాంగంబులఁ గనఁబడు

చుచు భూమిపాలునితో నిట్లనియె.

“దేవ! ఇక్ష్వాకురాజుని చక్రవర్తి చిహ్నంబులంగం టివా? సంజెకెంజాయరంజిలు బాలచంద్రకలం దలపించునితని ఫాలంబునఁ దామరతూఁటి చందమున నూర్ధ్వచిహ్నంబు పరికాశించుచున్నది. కరతలంబులు శంఖచక్ర చిహ్నితంబులై విష్ణుకరంబులవలెఁ గరంబు మెఱయుచున్నవి. చరణంబులును వ్రేల్పుమ్రాని క్రొంజివురులవలెఁ గోమలంబులై ధ్వజరథాది రేఖలు వెలయ రాజసహస్రంబుల కిరీట గతంబులగు రతనంబు లచే ముద్దుఁబెట్టకొనఁ దగియున్నవి. మఱియు నేడ్చుచుండ నిబ్బాలకు స్వరంబును దుందుభి రావంబువలె గంభీరంబై వినం బడుచున్నది. అని నుడువుచుండఁగనె పరిమళకుఁడను నొక్క పరిచరుండు త్వరిత గతినేతెంచి రాజునకు మ్రొక్కి “దేవ! అదృష్టము. ఫలించెను. శతృవులునిహతులైరి. చిరకాలము జీవింపుము. పుడమి జయింపుము. పూజ్యుఁడగు శుకనాసుని పత్నియందు రేణుకయందుఁ బరశురామునివలెఁ గొమరుండు దయించెను. అని విన్నవించిన నరపతి యమృతంపు సోనం బోలు నవ్వార్తనాలించి “ఏమి యీ కల్యాణపరంపర! కీడు కీడును మేలుమేలును ననుబంధించునను లోకప్రవాదము సత్య మైనది” అని పలికి మోముదమ్మి వికసింప శుకనాసుం గౌగి లించికొని నవ్వుచు మంగళకునకు నపరిమితమగు పారితోషి కము నొసఁగి యటనుండి లేచి వివిధవాద్యంబులు మెఱయ ప్రకృతులు-సామంతులును దోడరా శుకనాసుని భవనంబున కరిగి యందుత్సవము రెండింతలు నెఱపెను.

అనంతరమారాజు పదియవదినము ప్రాపింప శుభముహూర్తంబున గోవులను, సువర్ణమును కోట్లకొలఁది విప్రుల కొసఁగి స్వప్నంబున నితనితల్లినోరఁ జంద్రబింబము ప్రవేశించుచుండఁ గాంచితినని తదనుగుణంబుగఁ బుత్రునకుఁ జంద్రాపీడుండని నామకరణంబుగావించెను. మఱునాఁడు శుకనాసుండును బ్రాహ్మణులకుఁ దగు సకలకృత్యములను నెఱపి కొమరునకు బ్రాహ్మణులకుఁ దగునట్లు వైశంపాయనుఁడని నామకరణంబు నొనరించెను. క్రమంబుగఁ జౌలాదిసంస్కారంబులఁ బడసి చంద్రాపీడుండు బాల్యంబు నతిక్రమించెను.

## షష్ఠ ప్రకరణము.

### చంద్రాపీడుని విద్యాభ్యాసము

---

అత్తఱిఁదారాపీడుండు సుతునకుఁ గ్రీడావ్యాసంగంబు తరింపఁ జేయనెంచి వీటివెలుపల శిప్రానదీతీరంబున నర్ధక్రోశము విస్తారంబున స్వర్గభవనంబు ననుకరించు నొకవిద్యామందిరము గట్టించి, సర్వవిద్యలను నేర్పఁజాలు నాచార్యుల మహాయత్నంబున సంగ్రహించి వారిసన్నిధి శుభదినంబునఁ జంద్రాపీడుని వైశంపాయనునితోడనర్పించెను. అచ్చటనొరులు ప్రవేశింపరాని గురుపుత్రమాత్రసహాయుండై పంజరమున నున్న సింగపుగొదమచందమున శిశుజనక్రీడావ్యాసంగంబు విడిచి యనన్యమనస్కుండై యాచార్యులవలన నఖిలవిద్యల

నభ్యసించుచుండెను. చంద్రాపీడుండును రాజు చేనియుక్తుండై యేకాగ్రచిత్తంబునఁ జదువుచు నాచార్యులకు నుత్సాహంబు గలిగించుచుఁ గొలఁదికాలముననె సకలవిద్యలను గ్రహించెను. పదవాక్యప్రమాణములయందును, ధర్మశాస్త్రములయందును రాజనీతులయందును, చాపచక్ర కృపాణాదిసాధనములయందును, రథచర్యయందును, గాంధర్వవేదమునందును, హస్తిశిక్షయందును, అశ్వహృదయమందును, చిత్రకర్మమందును, ద్యూతకలలయందును, రత్నపరీక్షలందును, ఆయుర్వేదమునందును, మంత్రప్రయోగమునందును, విషాపహరణమునందును, కావ్యనాటకాదులయందును, పురాణేతిహాసములయందును, సర్వలిపులయందును, సకలదేశభాషలయందును, శిల్పమునందును, తక్కుంగల కలావిశేషములయందును మిక్కిలి కౌశలముగాంచెను.

మఱియు, శ్రమము నభ్యసించు నీరాకొమరునకు బాల్యంబుననే భీమునకట్లు సకలజనుల కాశ్చర్యముఁ గలిగించు మహాబలంబు గలిగియుండెను. అతండేనుఁగు గున్నలంగని చెవిఁబట్టినంతనే యవి సింహకిశోరంబునకుం జిక్కినట్లు కదలఁజాలకుండెను. ఇతండు బాల్యముననే యొక కత్తి వ్రేటునఁ దాటిమ్రాఁకులఁదమ్మి తూండ్లంబలె ఛేదించుచుండెను. పరశురాముని బాణంబులవలె నితని బాణంబులు భూధరంబులనుం భేదించుచుండెను. ఈ రాజనందనుండు పదుగురెత్తఁజాలిన యినుపగుదియతో సాధనముచేయుచుండెను. వైశంపాయనుండొక్కఁ బలంబునం దక్కఁదక్కుంగల కలలయందు నతని నను

కరించియుండెను. చంద్రాపీడునకు వైశంపాయనుఁడు విశ్వాస పాత్రంబగు పరమమిత్రంబయి యుండెను. వారిరువురును నొండొకరి విడిచి నిమిషమైన నొంటిమయియుండఁ జాలకుండిరి. ఇట్లుండ సాగరమునకు నమృతరసంబు రీతిని, కల్పవృక్షంబునకుఁ గుసుమోద్గమంబు చందంబునను నాచంద్రాపీడునకు యౌవనంబు ప్రాదుర్భవించెను. సమయమెఱిఁగిన సేవకుని విధంబున మారుండతని సమీపముననుండెను. లక్ష్మితోడ వక్షంబు విస్తరించెను. వైరిజనంబుతోడ నడుము కార్శ్యంబు నొందెను. ప్రతాపంబుతోడ రోమరాజి యంకురించెను, స్వరంబుతోడ హృదయంబు గంభీరంబాయెను. ఇట్లు నవయౌవనాభిరాముండై పరిసమాప్తసకలకలాకలాపుండైన కుమారుఁదోడ్కొనివచ్చుటకుఁ దారాపీడుండు శుభదినంబున సేనాధిపతియగు వలాహకుని బహుతురంగ బలంబుతోఁ బుత్తెంచెను. అతండును విద్యామందిరంబునకేగి తనరాక ద్వారపాలకులచేఁ దెలిపి ప్రవేశించి ప్రణమిల్లి వినయంబున నిట్లు విన్నవించెను.

"కుమార! మామనోరథంబులు పూర్ణంబులయ్యె. శాస్త్రంబులఁ జదివితివి. ఎల్లకలల నేర్చితివి. విద్యాగృహంబు వెలువడ నాచార్యులందఱు నంగీకరించిరి. కావున నిపుడువచ్చి తల్లులందర్శించి గురువులకుఁ బ్రణామంబుసేసి రాజ్యసుఖంబులనుభవింపుము. రాజలోకమును సమ్మానింపుము. అని మహారాజువారాజ్ఞాపించుచున్నారు. నీకయియేలినవారంపిన యింద్రాయుధంబను వారువంబు వాకిటనున్నది. ఇది సముద్రంబునం బుట్టి యుచ్చైశ్రవంబుతో సమానలక్షణంబైనది దేవరవారికి

యోగ్యంబని పారసీకాధిపతి పనిచెను. కావున దీనినధిష్ఠించి యనుగ్రహింతువుగాక అనిపల్కి మిన్నకుండెను.



## సప్తమ ప్రకరణము.

### ॥ నగర ప్రవేశము. ॥

అంతఁ జంద్రాపీడుండు తండ్రీయానతి శిరంబునం బూని రాఁదలఁచి 'ఇంద్రాయుధంబుం గొనిరమ్ము' అని గంభీర స్వరంబున బలికెను. పదంపడి యిర్వురుపురుషులు గొనిన చ్చుటయు వేగంబున గరుత్మంతునకుఁ బ్రతిపక్షియో, వాయు వునకుఁ ద్రైలోక్యసంచరణసహాయమో యననొప్పు నింద్రా యుధంబు జూడఁగనే ధీమంతుఁడైన నా రాజకుమారునకు విస్మ యంబుగలుగుటయు నంత నతండిట్లు మనంబున వితర్కించెను. పూర్వము దేవాసురులు మందరమునకు వాసుకినిఁజుట్టి సాగ రంబుం ద్రచ్చి యీయశ్వరత్నంబు నుద్ధరింపక యింకేరత్నంబు నుద్ధరించిరి? ఈ తేజి యతితేజస్వియు మహాప్రాణంబును నగు టం జేసి దేవతంబోలి యెక్కుటకును సంశయము గలిగించెడిని, సామాన్యతురంగమంబులకిట్టి యాకారంబులు గలుగునే? దేవ తలును మునిశాపంబున నిజశరీరంబులవిడిచి యిట్టిశరీరాంతర ములఁ బొందుచునేయున్నారు. తొల్లి స్థూలశిరుఁడను ముని రంభను శపింప నదిగోడిగయును మృత్తికావతియందు శత ధన్వుని సేవించుచుఁ బెక్కుకాలముండెను. అవ్విధమున నివ్వా యు శాపంబునలనఁబట్టిన మహాత్ముఁడొకండుగానోపు" నని

చింతించుచు నయ్యశ్వంబు నెక్కనెంచి లేచి యూగుఱ్ఱంబు కుఱంగటనిలిచి "మహాత్మ! నీవెవ్వండవో నీకునమస్కారము. నాయారోహణాతి క్రమంబు సహింపుము" అని యింద్రాయుధంబు నెక్కెను.

అట్లు రాజనందనుండు వారువంబు నెక్కి వెలువడి యప్రమేయమగు నశ్వసైన్యముంగాంచి తనకుఁ బ్రణమిల్లు రాజపుత్త్రుల నాదరించి వైశంపాయనునితోఁ గదలి వందిమాగధుల కైవారంబులు వెలయ నగరంబు ప్రవేశించెను. అంత నప్పౌరులు రాకుమారు నవలోకించి "నేఁడు ధన్యులమైతిమి. మాజన్మంబు సాఫల్యంబు నొందెను. చంద్రాపీడనిభంబున రూపాంతర మొందిన పుండరీకాక్షునకు నమస్కారము, అని నుడువుచుఁ బ్రణమిల్లిరి. నగరంబును చంద్రాపీడుం దర్శించు కుతూహలంబునఁ గన్నులు దెఱచెనోయనఁ దెఱువంబడిన కవాటంబులు, వాతాయనంబులును గలదయ్యెను. అప్పుడు చంద్రాపీడుండు విద్యాగృహంబునుండివచ్చెడినని విని దర్శించు కుతుకంబున నవ్వీటిబోటులందఱు సంభ్రమంబున నఱయఱగాఁ జేసికొనిన యలంకారములతోన వెలువడి సౌధంబుల నెక్కి నిక్కినిక్కి చూచుచుండిరి. అప్పుడు ముహూర్తమాత్రంబున, యువతిజనంబులు నిండియుండ సౌధంబులు నారీమయంబులో, వారిపదకమల విన్యాసంబున భూతలంబు పల్లవమయంబో, వారిలయంగ కాంతిచేనగరము లావణ్యమయంబో వారి యానన జాతంబుచే గగనంబు చంద్రబింబమయంబో యనఁ దనరియుండెను.

అప్పు డక్కాంతలు తమలో నొకరి నొకరు , త్వరితగ మనా! నన్నును రానిమ్ము. దర్శనోన్మత్తా! ఉత్తరీయము సవరించుకొనుము. మూఢా! ధమ్మిల్లము ముడివేసికొనుము. చంద్రాపీడ దర్శనవ్యసనిని! కాంచీదామము పట్టుకొనుము. దృష్టిహీనా! ఎంతసేపు చూచెదవే? పిశాచి! పయ్యెద జారుటం జేసి నిన్నుఁజూచి జనులు నగుచున్నారు, అతికోపనా! నీవ ముందు నిలువుము. మత్సరవతీ! ఒక్కతెవె వాతాయనంబు నరి కట్టెదవా! అనంగపరవశా! నాపయ్యెదంగొని పయ్యెద వేసికొనియెద వేల? సతీవ్రత గ్రహగృహీతా! చూడవలసిన దానిం జూడక కనుగవనువంచింపనేల? పరపురుష దర్శన పరిహార వ్రతా! చెడితివి. లెమ్ము. మాయుంబోలు నిక్కమాసు నాలోకింపుము, అని యిట్లు సపరిహాసంబులును, సవిలాసంబులు ను నై యతి రమణీయంబులగు నాలాపంబులు వినవయ్యెను.

అంతఁ జంద్రాపీడుండు క్రమంబుగ రాజమందిరద్వారంబుచేరి యిందాశ్వియుధంబుదిగి వైశంపాయనుని కరంబుపట్టుకొని వలాహకుఁడు త్రోవఁజూపుచుండఁ గృతయుగపురుషుల వలె మహాప్రమాణులగు ద్వారపాలురతో నొప్పు ద్వారదేశంబుదాటి రాజలోకంబు మ్రొక్కులగైకొనుచుఁ జనిచని హంస ధవళంబగు శయనతలంబునం గూర్చుండియున్న తండ్రింగాంచి ప్రణమిల్లెను. అప్పుడు తారాపీడుండు రమ్మురమ్మని పల్కుచు దూరంబుననుండియె కరంబులుసాచి యానందాశ్రుపులోలుక నక్కుమారునక్కునఁజేర్చికొనియెను. కౌగిలించి విడిచినంత జనకుని పాదపీఠంబు సమీపంబున నడపకత్తెయుత్తరీయముం

బఱచినను మీఁగాలందొత్రిచివైచి నేలపైఁగూర్చుండెను. అంత మహీకాంతుండు వైశంపాయనునిం బుత్రనిర్విశేషంబుగా నాదరించిన సతండును నుచితాసనంబునఁ గూర్చుండెను. అప్పుడు తారాపీడుండు కొంతదడ వానందపరవశుండై యుండి వత్స! పొమ్ము. పుత్త్రవత్సలయగు తల్లింగనుమని యాదేశింప, వల్లెయనిలేచి చంద్రాపీడుండు పరిజనంబులనిలిపి వైశంపాయనద్వితీయుఁడై యంతఃపురము ప్రవేశించి యట పూర్వకథలఁ జెప్పుచు నితిహాసంబులఁ జదువుచు ధర్మోపదేశంబుఁ జేయుచున్న వృద్ధ పరివ్రాజికలతోనున్న తల్లింగాంచి దండప్రణామంబుసేసి యచ్చట గొంతదడవుండి తదనుమతి వెడలి రాజమందిర ద్వారంబుననున్న యింద్రాయుధము నెక్కి రాజపుత్త్రులు తోడరా శుకనాసుంజూడ నరిగి బాహ్యాంగణంబున నెనారువంబుదిగి రెండవ రాజమందిరంబోయన నొప్పు శుకనాస భవనంబు ప్రవేశించి యనేక రాజసహస్రంబు మధ్యంబున నున్న శుకనాసునకు వినయంబునఁ బ్రణమిల్లెను.

శుకనాసుండును సంభ్రమంబునలేచి హర్షాతిశయంబునఁ గనుగవ నానందాశ్రువులురలఁ జంద్రాపీడుని వైశంపాయనునితోడ బిగికౌగిటఁ జేర్చికొనియెను. అంత నాదరంబున నొసఁగిన రత్నాసనంబు విడిచి రాజపుత్త్రుండు వైశంపాయన సహితంబుగ నేలపైఁగూర్చుండెను. రాజపుత్త్రుండు కూర్చుండ శుకనాసుండు దక్కఁ దక్కటి రాజలోకంబు నిజాసనంబుల విడిచి పుడమిపైఁ గూర్చుండిరి. అత్తఱి శుకనాసుండు క్షణము సేపూరకుండి పులకాంకురములచే లోని యానందము దెలు

ప్రుచు నిట్లనియె—“తండ్రీ! చంద్రాపీడ! సంపూర్ణ విద్యుం డవు, సంప్రాప్త యౌవనుండవు నగు నిన్నుంజూడఁ దారాపీడ మహారాజునకు నిపుడుకదా రాజ్యఫలప్రాప్తి కలిగెను. అనేక జన్మాంతరార్జితంబగు పుణ్యరాశి యిప్పుడు ఫలించెను. అపు ణ్యులకుఁ ద్రిభువనాశ్చర్యకరులగు మిము బోఁటివారు పుత్త్రు లై జన్మింతురె? ఈ ప్రాయమెక్కడ? అమానుషంబగు నీశక్తి యెక్కడ? ప్రజలకు భరత భగీరథ ప్రతిముండవగు నీవు పాల కుఁడవుగాన వారుధన్యులు. నిన్ను భర్తనుగాఁగోరి పుడమియే మి తపంబు సేసెనో? పుడమిం భరింపుము” అని పల్కి తాన వ నన కుసుమాదులచే గారవించి యనిచెను. పదంపడి రాజ కుమారుం డంతఃపురము ప్రవేశించి వైశంపాయనుని తల్లి యగు మనోరమం దర్శించి కుమార భవనంబు జేరి స్నానాది భోజనాంతంబగు దివసకృత్యములను దీర్చెను.

మఱుచటినాఁడు కైలాసుండను కంచుకి కన్యనొక్కతెం గొనివచ్చి చంద్రాపీడునకుం బ్రణమిల్లి యిట్లనియె—“కుమా ర! మహాదేవి విలాసవతి యానతిచ్చెను. ఈకన్యక కులూతా ధీశుని కూఁతురు, పత్రలేఖయనునది. మహారాజు కులూతే పతిం జయించి యతని పుత్త్రియగు నికన్యనుగొనివచ్చి యం తఃపుర పరిచారికా మధ్యంబున నునిచెను. ఇది రాజపుత్త్రి దిక్కులేనిదనియేను దీని నిందాఁకఁబెనిచితి. ఇక్కన్నియ నీకు నడపకత్తెగాఁ దగునని యనిచితి. నీవిద్దానియందుఁ బరిజన సామాన్య దృష్టినుంపఁ దగదు. దీనిశీలం బెఱుంగవని చెప్పి యనిచితి” అనినవిని రాకొమరుండు “అంబయానతి చొప్పున

మొదలిడుదునని చెప్పి వాని ననిచెను. పత్రలేఖయుఁ జంద్రాపీడునకు మ్రొక్కి తదనుమతి యెల్లప్పుడును తోడునీడవలె నెడఁబాయక సేవించుచుండెను. ఇట్లు గొంతకాలము గడచిన పిదపఁ దారాపీడుండు నందనునకు యౌవరాజ్య పట్టాభిషేకంబు సేయ నెంచి సంభారములం గూర్ప నుద్యమించెను. అప్పుడొకనాఁడు చంద్రాపీడుండు శుకనాసుని దర్శింపఁ బోయిన నామంత్రిముఖ్యుం డతనికి నీతినింకను గఱపనెంచి యాదరంబున నిట్లనియె.

---

## అష్టమ ప్రకరణము.

### శుకనాస నీతి.

---

«తండ్రీ! చంద్రాపీడ! సకలశాస్త్రంబుల నభ్యసించి, యెల్లవిషయంబులఁ దెలిసికొని యున్ననీకు నిఫు డుపదేశింపఁ దగిన దేమియుఁ గన్పట్టదు. ఐనను యౌవనంబునం బొడము తమము స్వభావగుణంబున సూర్యునిచే భేదింపఁబడకయు, రత్నకాంతులచే ఛేదింపఁబడకయు, దీపప్రభలచే వారింపఁబడకయుఁ గేవల మతిగహనంబయి యుండును. లక్ష్మీవలసం గలుగుమదంబు ముదిమియందును నణఁగనేరదు. ఐశ్వర్యతిమిరాంధత్వ మింకొకండు కలదు. ఇది యేకాటుకకును సాధ్యంబు గాదు. మదనజ్వరతాపంబు శైత్యోపచారంబులకు వంగనేరదు. రాజ్యమలావలేపంబు స్నానశౌచంబులవలనఁ దలంగునది కాదు. రాజ్యసుఖనిద్ర వేకువ మెలంకువనొంద

నేరదు. కాన విస్తరంబుగఁ జెప్పవలసె. లోకంబున నాగర్భ
శ్రీమత్త్వము, నవయౌవనము, నిరుపమానసౌందర్యము అమా
నుషశక్తియనునవి యనర్థములపరంపర. ఇందొకఁడొకఁడే
సకలదుర్నయంబులకు నిరవు. ఇన్నియుఁగూడినచో నేమి చెప్ప
వలయు? శాస్త్రజ్ఞానంబను జలంబునఁ గడుగఁబడి నిర్మలం
బయి యున్నను బుద్ధి యౌవనారంభమునఁ గాలుష్యము
నొందక మానదు. యౌవనవంతులదృష్టి ధావళ్యమును విడు
వకయ సరాగంబ యగుచుండును. సురగాలి యెండుటాకును
గొని చనునట్లు యౌవనసమయంబున రజోభ్రాంతినొందిన
ప్రకృతి పురుషునిఁ దనయిచ్ఛం గొనిచనును. విషయాసంగ
ము దిజ్మోహంబువలెఁ బురుషుని నుత్పథంబున నడిపించెడిని.
నీవంటివారలె యుపదేశంబునకుఁ బాత్రులు. చంద్రకిరణం
బులు స్ఫటికమణియందుఁ బ్రతిబింబించునట్లు లుపదేశగుణం
బులు నిర్మలమగు చిత్తంబున సుఖంబుగఁ బ్రవేశించుఁగదా?
గురువచనము నిర్మలమయ్యుఁ జెవి సొచ్చినంత నభాగ్యునకు
జలమువలె గొప్పచెవిపోటు పుట్టించును. అదియ ధీమంతునకు
నేనుంగునకు శంఖాభరణంబువలె నధికమగు ముఖశోభ నావ
హింపఁజేయును. ప్రదోషసమయంబున నిశాకరుం డంధకా
రము నడఁచునట్లు గురూపదేశము సకలమగు దోషజాతము
నడంచును. శాంతిహేతు వగుముదిమి నల్లనివెండ్రుకలఁ
దెల్లనివానిఁగా బరిణమింపఁజేయునట్లు గురూపదేశం బాదో
షజాతంబును గుణరూపంబుగఁ బరిణమింపఁజేసెడి. కావు వి
షయరసంబు చవిఁ జూడకుంట నుపదేశ మొంద నీకిది యుక్త

కాలము. కుసుమశరపరిహారంబునఁ జిల్లులువడిన చిత్తంబున జలమపోలె నుపదిష్టంబు నష్టమగును. దుస్స్వభావునకు సద్వంశము వినయప్రదాయకము కాదు. చందనవృక్షంబునఁ బొడమినంతనె యగ్ని కాల్పకుండునె? అవినీతునకు శాస్త్రంబును వినయసాధకము కానోపదు. దాని నశించుటకు హేతు వగునీటిచేతనే బడబాగ్ని ప్రజ్వలింపదా? గురూపదేశ మను మనుజులకు నఖిలమలంబులఁ గడుగఁజాలిన స్నానంబును, ముదిమి లేనివృద్ధత్వంబును, మేదో దోషంబు లేని గురుత్వంబును, సువర్ణమున రచింపఁబడని కర్ణాభరణంబును, జ్యోతిస్సు లేని ప్రకాశంబును, ఉద్వేగంబు నిడనిజాగరణంబును నగు. విశేషించి రాజులకు నుపదేశకులు లేరు. జనులు భయంబునఁ బ్రతిశబ్దంబువలె రాజవచనంబు ననుసరించుచుందురు. ఆరాజులు గర్వంబనుబధిరత్వంబుచే మూసికొనిపోయిన వీనులు గలవారలగుటంజేసి యుపదేశింపఁబడువచనంబు విననేరరు. ఒకప్పుడు విని రేని గజనిమీలితంబున నలక్ష్యముచేసి యుపదేశించు గురువుల కుమ్మలికంబు గలిగింతురు. రాజుల ప్రకృతి యహంకార మనుదాహజ్వరంబునం గలిగిన మూర్ఛచే నంధీకృతంబయి వివశంబయి యుండుం గదా? ధనంబులు వృథాభిమానం బనునున్మాదంబు గలిగించుచున్నవి. రాజ్యలక్ష్మి రాజ్యవిషవికారం బనుమాంద్యంబు నొసఁగును. కల్యాణకాముండ వగునీవు తొలుత లక్ష్మినే కనుఁగొనియెదుగాక.

సుభటుల ఖడ్గమండలంబు పేరియుత్పలవనంబునం భ్రమించు దేఁటియగు నీలక్ష్మి క్షీరసాగరంబుననుండి వెడలు

నప్పుడు సహవాసపరిచయవశంబునఁ బారిజాతపల్లవంబుల వలన రాగంబును, నిందుశకలంబువలన వక్రగుణమును, నుచ్చై శ్శ్రవంబు వలనఁ జాంచల్యమును, కాలకూటంబువలన మోహనశక్తిని, మదిరవలన మదమును, కౌస్తుభమణివలన కాఠిన్యమును నిట్లు విరహావినోదచిహ్నంబులు గ్రహించెనో యన నొప్పును. లోకంబున నిట్టివస్తు వింకొక్కటి కన్పట్టదు. ఏలన, ఈలక్ష్మి కష్టంబున లభించియు దుఃఖంబునఁ బాలింపఁబడు చుండు. గట్టిత్రాళ్ళంగట్టి కదలకుండ నునిచినను వదలిపోవు ను. వీరభటసహస్రంబు బట్టినయసిలతాపంజరమునకు నునిచినను దప్పించుకొనును. మదజలంబు వర్షించుకుంజరపుంజంబులచేఁ బాలింపంబడియుఁ బరుగిడును. పరిచయమును రక్షింపదు. కులముం జూడదు. రూపము నాలోకింపదు. కులక్రమము ననువర్తింపదు. శీలముం గనుఁగొనదు. వైదగ్ధ్యమును గణింపదు. శాస్త్రము నాకర్ణింపదు. ధర్మము ననురోధింపదు. త్యాగము నాదరింపదు. విశేషజ్ఞతను విచారింపదు. ఆచారమును బాలింపదు. సత్యమును దెలిసికొనదు. లక్షణమును బ్రమాణీకరింపదు. గంధర్వనగరలేఖయుంబోలె చూచుచుండనె నశించును. మందరము తిరుగుచున్నపుడు వొడమినభ్రాంతిసంస్కారంబు నిప్పుడును దాల్చినదియుంబోలె నుండినచో నుండక తిరుగుచుండును. పంకజవనంబున సంచరించునప్పుడు కరికాలఁ దమ్మితూఁటిముల్లు నాటెనో యన నొక్కచో నడుగుఁ జక్కగా మోపదు. రాజగృహంబులయందతియత్నంబున ధరింపఁబడియు గంధగజంబులగండతలమధువు గ్రోలి మ

త్తిల్లనో యనఁ దొట్రువడుచుండును. తైక్ష్ణ్యము నభ్యసింప నోయన నసిధారలయందు వసించును. విశ్వరూపత్వము న గ్రహింపనో యన నారాయణమూర్తి నాశ్రయించును, సరస్వతీపరిగృహీతుఁడగు జనుని నీర్ష్యచేతనో యన నాశ్లేషింపదు. గుణవంతుని నపవిత్రునింబలె స్పృశింపదు. ఉదారసత్త్వుని నమంగళునింబలె బహుమానింపదు. సుజనుని నని మిత్తునివలెఁ జూడదు. సత్కులప్రసూతుని సర్పమునుంబలెనతిక్రమించును. శూరుని కంటకునింబలెఁబరిహరించును, దాతను దుస్స్వప్నముంబలె స్మరింపదు. వినీతునిఁ బాతకినింబలె సమీపింపదు. మానవంతుని నున్మత్తునింబలెఁ జూచి నవ్వుచుండును. తనచారిత్రము నింద్రజాలమునట్లు పరస్పరవిరుద్ధముగాఁగనంబఱచును. ఎట్లన, దాహము నారోపించుచుజాడ్యమును గలిగించును. ఉన్నతినొసంగుచు నీచస్వభావమునుబ్రకటించును. సాగరమునఁ బొడమియుఁ దృష్ణను బెంపుసేయును. ఈశ్వరత్వమును దాల్చియు నశివప్రకృతిత్వమును విస్తరించును. బలవృద్ధి నొసంగుచును లాఘవమును గలిగించును. అమృతసహోదరి యయ్యుఁ గటువిపాకయు, బుధహోత్తమరత యయ్యు ఖలజనప్రియయునై ధూళివలె స్వచ్ఛమైనవానిం గలుషునిఁ గావించును. ఈచపల ప్రకాశించుకొలఁది దీపశిఖవలెఁ గజ్జలమలినం బగుకర్మంబునె వెలార్చును. మఱియు నియ్యది తృష్ణయను విషలతలకు వారి ధారయు, ఇంద్రియమృగంబులకు వ్యాధగానంబును, సచ్చరితంబులను చిత్రింబులకు ధూమరేఖయు, మోహంబు నిద్దీర్ఘనిద్రలకు విభ్రమశయ్యయు, ధన

మదపిశాచంబులకుఁ గూటగృహంబును, శాస్త్రదృష్టులకుఁ దిమిరోద్గమంబును, సర్వావినయంబులకుఁ బురస్సరపతాకయు, క్రోధావేశగ్రాహంబులకు నుత్పత్తినదియు, విషయమద్యములకుఁ బానీయశాలయు, భ్రూవికారనాట్యంబులకు సంగీతశాలయు, లోకాపవాదంబులకు నెలవును, కపటనాటకంబులకుఁ బ్రస్తావనయు, కామగజంబునకుఁ గదళికయు, సాధుభావంబునకు వధ్యశాలయు, ధర్మంబను నిందుబింబమునకు రాహుజిహ్వయు నగును. ఈసిరితో స్థిరముగఁ గూడియున్నవానిని, దీనిచే మోసపోని వానిని నే నెఱుంగను. ఇయ్యది చిత్తరువున నున్నను చలించును. పుస్తకరూపురాలయ్యు నింద్రజాలము రచించును. గట్టిగఁ గట్టినను వదలిపోవును. ఇట్టి దురాచారయగుసిరిచే నెట్లో దైవవశంబునఁ బరిగ్రహింపఁబడినవారై రాజులు పారవశ్యము నొంది సర్వావినయంబులకధిష్ఠాన మగుదురు. ఎట్లన, అభిషేకసమయముననె వీరిదాక్షిణ్యం బభిషేకజలములచేఁ గడుగఁబడియెనో యన వదలిపోవుచుండును. వారలడెందం బగ్నికార్యధూమముచేతనో యన మాలిన్యము నొందును. పురోహితులకుశాగ్రములనుసమార్జనులచేఁ దుడువఁ బడియెనో యన క్షమపోవును. ముదిమిరాఁగల దనుస్మృతి పట్టబంధముచేతనో యన నాచ్ఛాదింపఁబడును. పరలోకదృష్టి యాతపత్రమండలముచేతనో యన వారింపఁబడును. సత్యవాదిత్వము వింజామరలగాడ్పులచేతనో యన నపహరింపఁబడును. గుణములు వేత్రదండములచేతనో యన బారదోలఁబడుచుండును. సాధువాదంబులు జయశబ్ద

కలకలంబు చేతనో యనఁ దిరస్కరింపఁబడుచుండును కుశము
ధ్వజపటంబులచేత ననఁ బరామర్శింపఁబడుచుండును.

కొందఱు శ్రమవశంబున శిథిలంబయిన పక్షి మెడవలెఁ
చంచలంబులై మిణుఁగురుల ప్రకాశంబువలె క్షణమాత్రము
మనోహరంబులై, మానస్విజనులచే గర్హితంబులైన సంపదలచే
నాశపెట్టఁబడి, ధనలవంబు లభించుటం గలిగిన గర్వంబున జ
న్మంబును మఱచి యనేకదోషంబులం బెరిఁగినదుష్టర్కంబుచే
తనన రాగావేశంబుచే బాధింపఁబడుచు, వివిధంబులగు విష
యరసంబుల గ్రసింప లోలుపంబులై యేనైన ననేకసహస్ర
సంఖ్యలో యనఁ దనరు నింద్రియంబులచే నాయాసపెట్టఁబడు
చు, పారవశ్య మొందుచున్నారు. మఱియు గ్రహములచే
గ్రహింపఁబడిన వారివలెను, భూతములచేఁ దిరస్కరింపఁబడిన
వారివిధంబునను, మంత్రములచే నావేశపెట్టఁబడినవారిచందము
నను, సత్త్వములచేఁ బట్టుకొనఁబడిన వారిరీతిని వర్తింతురు.
మదనశరంబులచే మర్మంబులయందుఁ గొట్టబడిన వారివలె
ముఖవికారంబులఁ గనంబఱుతురు. ధనదాహంబున నుడుకు
వారివలెఁ బరితపించుచుందురు. గొప్పదెబ్బలు తినినవారివలెఁ
దమయంగంబుల ధరింపజాలకుందురు. కుళీరంబులవలె వక్రం
బుగఁ బరిభ్రమింతురు. అధర్మంబునఁ గమనశక్తి దప్పిన
కుంటివారివలెఁ నొరులచే నడిపింపఁబడుదురు. మృషావాదం
బనువిషంబువిపాకంబునం గలిగిన ముఖరోగంబు గలవారివలె
నతికష్టంబుగ మాటాడుదురు. కుసుమరజంబులచే నేడాకుల
యనంటులవలె వికారంబులచే సమీపమున నున్నవారలకుఁ

దలనొప్పి గలిగింతురు. ఆసన్నమృత్యువులవలె నెదుటనున్న బంధుజనునైనఁ దెలిసికొనంజాలరు. కాలసర్పదష్టులవలె మహా మంత్రములచేనైనఁ దెలివినొందరు. లక్కబొమ్మలవలె నుష్ణ మును సహింపరు. అకాలకుసుమంబులవలె మనోహరాకృతు లయ్యు లోకవినాశనంబునకు హేతువులగుదురు. శ్మశానాగ్ను లవలె నతిభయంకరంబగు భూతిగలవారును, తిమిరరోగగ్రస్తు లవలె దూరదృష్టి లేనివారును, చింతింపఁబడియు మహాపాత కంబువలె నుపద్రవంబు నాపాదింతురు. అనుదినంబును బాప ముచే నిండింపఁబడినవారివలె బుసఁగొట్టుచుందురు. అట్టి యవస్థలో నున్నవారలు వ్యసనశతంబులకు గుఱియై వల్మీ కతృణాగ్రంబున నున్న జలబిందువుంబోలెఁ బతితులైనను దన్నుఁ దెలిసికొనంజాలరు.

మఱికొందఱు జూదము వినోద మనియుఁ, బరదా రాభిగమనము వైదగ్ధ్య మనియు, వేట పరిశ్రమంబనియు, స్వదారపరిత్యాగము వ్యసనరాహిత్యంబనియు, గురువచనము సరకుగొనమి స్వాతంత్ర్యమనియు, భృత్యుల జయింపమి సుఖోపసేవ్యత్వ మనియు, నృత్యగీతాదులయందును, వేశ్యల యందును నాసక్తి గలిగియుంట రసికత యనియు, గొప్ప తప్పుల వినకుండుట మహానుభావత్వమనియు, లోకనింద స హించుటయె తాలిమి యనియు, తనకుఁ దోఁచునట్లు నడచు టయె ప్రభుత్వమనియు, దేవావమాన మొనర్చుటయె మహా సత్వత యనియు, వందిజనుల పొగడ్తయె కీర్తియనియు, చాం చల్యమె యుత్సాహమనియు, మంచి చెడుగుల వినకుండుటయె

నిష్పక్షపాత మనియు, దోషములయందు గుణత్వము నారో
పించుచు, లోలోన నగుచు, దుర్బోధ లాచరించుచు, స్వార్థ
పరులును, ధనపిశితంబు గ్రసింపఁ గ్రద్దలును, నగుధూర్తులు
అమానుషోచితంబులగు స్తుతులచేఁ దమ్ము వంచించుచుండ
విత్తమదంబుచే మత్తుగొనిన చిత్తంబున నిశ్చేతను లగుటఁ
జేసి యట్టులే యని తమయందు వృథాభిమానంబు నారోపిం
చుకొని మర్త్యధర్ము లయ్యును దివ్యాంశంబున నవతరించిన
వారివలెఁ దమ్ము నమానుషులనుగా నూహించుచు సర్వ
జనంబునకును నుపహాస్యత నొందుచుందురు. భృత్యులు
సేయుఁ దమపరిహాసమును విని సంతసింతురు. తమయందు
మనంబున దేవతాభిమానంబు వహించి తక్కటి యిరుసేతు
లును లోన నున్నవానిఁగా నెంతురు. తను మూఁడవకన్ను
చర్మంబుచేఁ గప్పఁబడియె నని భావింతురు. దర్శన మొసంగు
టయె యనుగ్రహముగా లెక్కింతురు. కంటఁ జూచుటయెయుప
కారపక్షంబున స్థాపింతురు. సంభాషణంబును నీవిలో గణిం
తురు. ఆజ్ఞ నొసంగుటయు వర మొసంగుటఁ గాఁ దలంతురు.
స్పర్శంబునె పావనముఁగా భావింతురు. మిథ్యామాహాత్మ్యం
బునం బరిపూర్ణగర్వులయి దేవతలకుం బ్రణమిల్లరు. విప్రులఁ
గారవింపరు. మాన్యుల మన్నింపరు. పూజ్యులఁ బూజింపరు.
పెద్దల కభివాదనము సేయరు. గురువుల కభ్యుత్థానముసల్పరు.
నిరర్థకమగు నాయాసంబున విషయోపభోగంబు నెఱుంగ
రైరని పండితులఁ బరిహసింతురు. ముదిమినగు పారవశ్యమునఁ
బ్రేలపింతురని వృద్ధజనోపదేశంబు నాకర్ణింపరు. తమప్రజ్ఞకుఁ

బరిభవంబని యెంచి సచివోపదేశంబు గ్రహింపరు. హిత
వాదినిఁ గోపింతురు. మఱియెవఁడేని సకలకృత్యంబుల విడిచి
దోయిలిఁబట్టుకొని రేలుంబవళ్లు దేవతంబలె స్తుతిచేయునో,
మాహాత్మ్యంబుఁ జాటునో, వానిని మెత్తురు. వానిం బ్రక్క
నునిచి కొందురు. వానికొసంగుదురు. వానిం బహుమానిం
తురు. వానిం బరమాప్తునింగా భావింతురు. నరపతులకేమి
యోగ్యతకలదు? వారలకు నతిక్రూరంబగు నుపదేశంబు గలిగి
నిర్దయంబైన కౌటిల్యశాస్త్రము ప్రమాణము. అభిచారక్రియ
లచేఁ గ్రూరప్రకృతులగు పురోహితులు గురువులు. పరోచ్ఛేద
కర్తలగు మంత్రు లుపదేశకులు. పెక్కురాజు లనుభవించి విడి
చిన లక్ష్మియందాసక్తి. మారణరూపములగు శాస్త్రముల
యందు నభిమానము. సహజ ప్రేమార్ద్ర హృదయులగు
తోఁబుట్టువులు నిర్మూలము సేయఁదగినవారు, కుటిలములగు
నిట్టికష్టచేష్టలచే దారుణమగు రాజ్యతంత్రమునందును, మహా
మోహాంధకారంబుగల యౌవనమునందును కుమార! నీవెట్లు
ప్రవర్తించెదో, ఎట్లు జనులచే నుపహసింపఁబడవో, గురువు
లచే ధిక్కరింపఁబడవో, సాధువులచే నిందింపఁబడవో, మిత్రు
లచే నుపాలంభింపఁబడవో, పండితులచే శోచింపఁబడవో, మఱి
యెట్లు విటులచే మోసపుచ్చఁబడవో, కుశలులచేఁ బరిహసింపఁ
బడవో, మదముచే నర్తింపఁబడవో, మదనునిచే నున్మత్తీక
రింపఁబడవో, విషయములచే నాకర్షింపఁబడవో, అట్లు ప్రవ
ర్తింపవలయు. ఈవు స్వభావంబునన ధీరుండవు. తండ్రిచే
మహాప్రయత్నంబున సంస్కరింపఁబడితివి. ధనంబులు వివేక

హీనుండగు చపలచిత్తుని మత్తునిఁగావించుఁగాని నినుబోటి వానిం జేయఁజాలవు. అయినను నీగుణములయందగు సంతోషము నన్నిట్లు పలికించెను. లక్ష్మి విద్వాంసునైన, సచేతనునైన, మహాత్మునైన, నభిజాతునైన, ధీరునైన, బ్రయత్నవంతునైన నీచునిఁగావించును, అని నీకుఁ బలుమాఱుఁ జెప్పుచున్నాఁడను. నీవు తండ్రి యాచరించు నవయౌవరాజ్యాభిషేకమంగళము ననుభవింతువుగాక. కులక్రమాగతమై పూర్వపురుషులచే వహింపఁబడిన భూభారంబు వహింపుము. వైరిశిరంబుల నమ్రీకరింపుము. బంధువర్గము నుద్ధరింపుము. అభిషేకోత్సవానంతరమున దిగ్విజయమున కారంభించి చరించుచు నీతండ్రిచే జయింపఁబడినను సప్తద్వీపసముద్రభూషణయగు వసుంధరను మగుడ జయింపుము. ప్రతాపంబును గానిపింప నీకిది యుక్తకాలము. అని వాక్రుచ్చి యుపరమించెను. ఇట్లు శుకనాసుండుపదేశింపఁ జంద్రాపీడుండా వచనంబులచేఁ గడుగఁబడియెనో, స్వచ్ఛీకృతుఁడాయెనో, అభిషిక్తుఁడాయెనో, అలంకృతుఁడాయెనో యన ముహూర్తమాత్రంబుండి నిజభవనంబునకుం జనియెను.



## నవమ ప్రకరణము.

### పట్టాభిషేకపూర్వక దిగ్విజయయాత్ర.

అంతఁ గొన్ని దినంబులు కడచనఁ దారాపీడుండు తాఁ మంగళకలశంబు బట్టికొని శుకనాసుం గూడి పుణ్యదినంబునఁ

బురోహితుండు మంగళకృత్యముల నెఱవేర్ప ననేకనరపతి
సహస్రమధ్యంబున సకలతీర్థంబులనుండియు, సకలనదులనుండి
యు, సకలసముద్రములనుండియుఁ గొనిరాఁబడి సర్వౌషధు
లతో, సర్వఫలంబులతో, సర్వమృత్తికలతో, సర్వరత్నంబు
లతోఁ గూడి యానందబాష్ప మిశ్రితంబును, మంత్రపూ
తంబు నగుజలంబుచేఁ జంద్రాపీడు నభిషేకించెను. అభిషేక
సలిలార్ద్రదేహుండగు నతనియందు రాజలక్ష్మి ప్రవేశించెను.
అనంతర మఖిలాంతఃపురయువతులం గూడి విలాసవతి సురభి
చందనం బలఁది మాలతీకుసుమమాలిక సిగకుఁ జుట్టెను. అప్పుడు
తారాపీడుండు వేత్రదండంబుం గైకొని జనంబుల జడియు
చుండఁ జంద్రాపీడుండు సభామండపమున కరుదెంచి చం
ద్రుండు మేరుశృంగము నధిష్ఠించునట్లు సింహాసనము నధిష్ఠిం
చెను. అట్లు చంద్రాపీడుండు సింహాసనారూఢుండై తగు
నట్లు రాజలోకంబును సమ్మానింపఁ బదంపడి దిగ్విజయప్రయా
ణంబు సూచించుచుఁ మందరఘాతంబులచే నుదధిచందంబున
కనకకోణంబులచేఁ గొట్టఁబడి ప్రస్థానదుందుభి మ్రోసెను.
ఆదుందుభి ధ్వనించుచుండఁ బూరితంబులో, బధిరీకృతంబులో,
యనఁ దనరు సకలదిశల సంధిబంధంబులు సడలెను. ఆదుందుభి
రవంబు విని జయజయ యని యెల్లరుం బలుకుచుండఁ జంద్రా
పీడుండు వైరులసిరితోడ సింహాసనంబుననుండి లేచి నరపతి
సహస్రంబు వెంబడింప నాస్థానమండపంబు వెలువడి ప్రయా
ణంబునకుం దగునట్లలంకరింపఁబడి ముందుగఁ బత్రలేఖచే
నధిష్ఠింపఁబడిన పిడియేనిక నధిష్ఠించి ముక్తాఫలాలంకృతంబై

శతశలాకం బైన యాతపత్రం బాతపంబు వారించుచుండఁ
గను, ఇంద్రాయుధంబు ముందుగఁ జనుచుండఁగను, మెల్ల
మెల్లం దొలుతఁ దూర్పుదెస కభిముఖుండయి వెడలెను,
అప్పుడు మహాప్రళయ జలధిజలంబో యన సకల బలంబును
గదలెను. అంత వైశంపాయనుండు ప్రస్థాన మంగళవేషంబు
దాల్చి మహాబల సమూహంబుతోఁ గరిణి నెక్కి సూర్యునకు
జంద్రునివలెఁ జంద్రాపీడునకు సమీపస్థుఁడాయెను. అప్పుడు
బలంబులకోలాహలంబు చేతను, కాహళలనినాదంబు చేతను,
వారువంబుల హేషారవంబుచేతను, ప్రయాణపటహంబుల
రావంబులచేతను, జర్ఝరంబైన శ్రవణపుటంబులుగల జనంబు
నకు మూర్ఛవచ్చినట్టులుండెను. అత్తఱి ధాత్రీతలంబుననుండి
లేచెనో, పాదంబులనుండి వెడలెనో, దెసలనుండి యేతెం
చెనో, యనునొప్పి సూర్యునిఁ రకుఁ గొనని యంధకారం బన
భాసిల్లు మహారజంబు ముల్లోకంబుల వ్యాపించెను. రజో
ధూసరితంబై రవిబింబంబు నిష్ప్రభం బాయెను.

అప్పుడు వైశంపాయనుం డపరిమితం బైన బలంబుం
గాంచి విస్మయంబు నొంది రాజనందనుతో నిట్లనియె;—
‘యువరాజ’ నీవు జయింప మహారాజాధిరాజగు తారాపీడుం
డు జయింపని దేమి కలదు? నీవు వశము సేసికొన మహా
రాజుచే వశీకరింపఁబడని వేదెసలు గలవు? నీవార్జింప నార్జిం
పఁబడని యే రత్నాంతరంబులు గలవు? నమ్రులు కానిరాజు
లెవరు కలరు? సేవాంజలి బట్టనివారెవరు? చామరంబులు
వీవనివారెవరు? జయశబ్దంబు పలుకనివారెవరు? పృథివియం

దుఁగల భరతభగీరథ ప్రతిములగు మూర్ధాభిషిక్తులెల్లఁ దను
దమ చూడామణి పల్లవంబులచే నీపాదరజంబును రత్నాభూతి
నింబలె ధరించుచున్నారు. నీబలంబులును దెసలనెల్లఁ గప్పి
యున్నవి. ఇప్పుడు పుడమి బలభరాక్రాంతంబయి మహాభార
తసమరసంక్షోభంబుం దలంచునని యెంచెద. ఇయ్యెడ ధరిత్రి
బలభరంబుచే సకల శైలసంధి బంధఁబులును సడలి వేలకొలఁది
తునుకలు గాకుంట కడుచిత్రము. అని పలుకుచుండఁ నె యువ
రాజు పటమండపసహస్రంబులచే భాసురంబగు నావాసదేశం
బు ప్రవేశించెను. అట నాదినఁబు గడపి మఱునాఁడు లేచి
సేనాసముదాయంబుతోఁ దరలి యున్నతుల వంచుచు, భీతుల
నూఱడించుచు, శరణాగతుల రక్షించుచు, శత్రువుల నిర్మూ
లము చేయుచు, స్థాన స్థానంబులను రాజపుత్త్రుల నభిషేకిం
చుచుఁ బుడమిం జరించెను. తొలుతఁ దూర్పును, పదంపడి
దక్షిణమును, నంతటఁ బశ్చిమమును, నవ్వల నుత్తరంబును
జయించెను. ఇట్లు మూఁడువత్సరంబులలో ద్వీపాంతరంబుల
నెల్ల వశపఱచుకొని భూవలయమెల్లం బరిభ్రమించెను. అంత
నొకప్పుడు కైలాసమునకు సమీపమునయున్న హేమజటులను
కిరాతులకు నావాసంబగు హేమజటంబను పురమును జయించి
తనబలంబుల విశ్రాంతికై యచటఁ గొంతకాలము వసించెను.

---

## దశమ ప్రకరణము.

### ఓం కిన్నర మిథునానుగమనము. శ్రీ

అటదుండి యొకప్పు డింద్రాయుధంబు నెక్కి యొక్కెడ
వేఁటకుం జని యచట శైలశిఖరంబుననుండి దిగినకిన్నర మిథు

నంబుం గాంచి యచ్చెరువుపడి గ్రహింపఁబూని తురగంబును ప్రేరేప నాకిన్నరమిథునంబును భయంబునం బఱువసాగెను. అప్పుడు మడిమలతోఁ బొడుచుటంజేసి యింద్రాయుధం బతివేగంబునం జనుచుండ నిదొ పట్టితి నిదొ పట్టితిననియెంచుచు ముహూర్తమాత్రంబునఁ బంచదశయోజనంబులదూరం బతిక్రమించెను. ఇట్లు వెన్నంటిపోవుచుండ నక్కిన్నరమిథునంబు ఎత్తైన పర్వతశిఖరంబు నధిష్ఠించెను. అంతఁ జంద్రాపీడుండు కిన్నరమిథునంబువలన దృష్టిమరలించి గుఱ్ఱంబునాపి శ్రమంబునఁ జెమ్మటఁగార్చుతన్న నింద్రాయుధంబుం గాంచి క్షణమాత్రము విచారించి తన్నుఁదాన నవ్వుకొని యిట్లు తలంచెను ఏనేల బాలునివలె శరీరము నాయాసపఱిచితి? ఈకిన్నరమిథునంబుం గ్రహించిననేమి? గ్రహింపకున్న నేమి? దీననాకేమి ప్రయోజనము? ఏమి నావకాక్ష్యము? ఆరంభించిన రాజధర్మమూ తుదిముట్టదాయె. నాకృత్యము నాకె నగవును గలిగించెడిని. నాసైన్యంబెంతదవ్వాయెనో యెఱుంగ. మహాజవంబగు నింద్రాయుధంబు నిమిషమాత్రంబున నతిదూరంబు నాక్రమించును. మరలిపోవనైన వచ్చునపుడు కిన్నరమిథునంబున దృష్టి నిగిడించినవాఁడనగుటం జేసి మహావనంబున మార్గంబు గుర్తింపఁజాల. మార్గంబు నడుగనైన నిందు మనుష్యమాత్రుండు కానరాఁడు. ఏనుఁదొల్లి సువర్ణపురంబునకు నుత్తరంబునఁ బుడమికి సీమాంతలేఖ గలదు. దాని కవ్వల నిర్మానుషంబగు నరణ్యంబును, దాని నాక్రమించి కైలాసగిరియుఁ గలదు. అని వినియుంటిని ఇదియె కైలాసము కాఁబోలు, కాన నిపుడు నేనొంటిమైయి

మరలి కేవలము దక్షిణదిశనె కాంచుచుఁ బోవలయు. తన చేసిన దోషంబుల ఫలంబు తానయనుభవింప వలయుంగదా? అని నిశ్చయించి తురగంబును మరల్చి మగుడ నిట్లని చింతిం చెను.

ఇప్పుడు భానుండు గగనమధ్యంబు నధిష్ఠించి యున్న వాఁడు. ఇంద్రాయుధంబు పరిశ్రాంతి నొందెను. కాన వాహ నంబును నీరుద్రావించి యేనును జలంబుగ్రోలి యొక్క చెట్టు నీడ ముహూర్తమాత్రంబు విశ్రమించి పోయెదనని యాలో చించి జలము వెదకఁ దలంచి యిటునటు దృష్టినునిచి తిరుగుచుఁ దడిసినమార్గంబును గాంచి కొంతద వ్వరిగి యాశానదిగ్భా గంబున నతిమనోహరంబయి, దృష్టి కాహ్లాదజనకంబయిన యచ్ఛోదంబను కొలనిం గాంచెను. దానిం గనినంతనె సకల శ్రమంబును విడిచి చంద్రాపీడుండు మనంబున నిట్లు చింతిం చెను. చిత్రము! కిన్నరమిథునంబు వెంబడించి నావచ్చుట వ్యర్థఫలంబైన నిద్దానిం గాంచుటచే సాఫల్యంబు నొందెను. ఇప్పుడు చూడవలసినదానిఁ జూచుటచేఁ గన్నుఁగవ సఫలం బాయె. ఇయ్యది విమలంబగుటఁ గన్నుఁగవకు బ్రీతిం గలిగిం చెడి. చల్లని దగుట స్పర్శసుఖంబు నొసంగెడి. కమలసుగంధి యగుట నాసికం దనియించెడి. హంసముఖరంబగుట శ్రోత్ర సుఖంబు నొడఁగూర్చెడి. మధురంబగుట జిహ్వేంద్రియంబు నానందింపఁ జేసెడి. ఇట్లియ్యది యమృతంబువలె! సకలేంద్రి యంబుల నాహ్లాదింపఁజాలును. అని విచారించుచునె దక్షిణ తీరంబునకు విచ్చేసి తురంగమంబుదిగి గుఱ్ఱంబును నీరు ద్రా

వించి తానును జలము గ్రోలి యొకచెట్టునీడ విశ్రమించెను. ఇట్లు ముహూర్తమాత్రంబున సేదదీర్చుకొని సరసియుత్తర తీరంబునందుండి యమానుషంబగు గీతరవంబు నాకర్ణించి మనుష్యసంచారంబు లేని యిచ్చోట గీతశబ్దంబెట్లు కలిగె, నని వితర్కించి యాదెసను దృష్టి నిగిడించి యేమియుం గానక గీతశబ్దము వినంబడుచుండుటంజేసి దానికిఁ గతంబు గనుం గొను కుతూహలంబున నింద్రాయుధంబు నెక్కి కొలని పడమటిగట్టున వెడలి చంద్రప్రభమను కొలనికిఁ బశ్చిమతీరంబున విరూపాక్షుసిద్ధాయతనంబుఁ గాంచెను. అందు మందాకినీపుండరీకంబులచే నర్చితుండును, మహార్హకళింగాకృతియు, చతుర్ముఖుండును, భగవంతుండు నగుత్ర్యంబకుని నర్చించెను. అప్పురహరునెదుట నిర్మలయు, నిరహంకారయు, పరిగృహీతపాశుపతవ్రతయునై దక్షిణకరంబున వీణియ మీటుచు, ప్రత్యక్షమైన గంధర్వవిద్యయో యన గీతిచే విరూపాక్షదేవు నారాధించు కన్యక నొక్కతెం గనియెను.

---

## ఏకాదశ ప్రకరణము.

### — మహాశ్వేతా వృత్తాంతము. —

---

అంత రాజనందనుండు తురంగంబుదిగి దాని నొక్క చెట్టునకుంగట్టి భగవంతుండగు నుమాకాంతునకుం బ్రణమిల్లి

యాదివ్యకన్యకను కనుఱెప్పవ్రేయక కాంచుచు దాని కాంతికి శాంతికిని నచ్చెరువొంది తనమదిలో నిట్లు చింతించెను. ఈ యాకృతింజూడ దివ్యకన్యకయంటకు సందియంబులేదు. అట్లు గాన నియ్యది తిరోధానంబు నొందదేని, గగనతలంబున కెగయదేని నంత నీవెవ్వతవు? నీపేరేమి? ప్రథమ సమావసంబున వ్రతంబేలపూనితి వని యడిగెదనని నిశ్చయించి యటగూర్చుండి గీతావసానంబు నిరీక్షించుచుండెను.

తరువాత గీతాంతంబున నక్కన్యక పరమేశ్వరునకుఁ బ్రణామిల్లి రాజపుత్త్రుంగాంచి ,అతిథికి స్వాగతమె ! నాతోనరుదెంచి యతిథిసత్కారంబు గ్రహింతువుగాత. మహాశ్వేతయు చంద్రాపీడుండు భక్తిచే నమస్కరించి వినయంబున నాయమ వెంబడి చని యతిథి సత్కారంబు గ్రహించి యామె యనుగఁదన యుదంతంబంతయు నెఱిఁగించెను.

అనంతరమా రాజపుత్త్రుండు వినయంబున నిట్లనియె. భగవతి! దేవతలు, గంధర్వులు, అప్సరలు, లోనగువారిలో నెవ్వారి కులంబును భగవతి జన్మముచే ననుగ్రహించెనో? ఈలే బ్రాయమున నేలవ్రతంబువూనెనో? ఈప్రాయమెక్కడ! ఈతప మెక్కడ? ఈ రూపమెక్కడ? ఈశాంతియెక్కడ? ఇట్టివార్త మున్ను గని వినియు నెఱుఁగను. కావున సకలంబుంజెప్పి నా కౌతుకంబు దీర్తువుగాక. అని యడుగ నాయమ్మన నిట్టూర్పు విడిచి కన్నీరుగార్చుచు నిశ్శబ్దంబుగ నేడ్వఁదొడంగిన రాజపుత్త్రుండిట్లు తలంచెను. చిత్రము! వ్యసనంబులు దుర్నివారంబులు సంతాపంబులు దేహిమాత్రుని విడువనేరవని యొంది

యీయమనోదార్ప నాకన్యక కన్నులు గడిగికొని నారచీర కొంగున మోముదమ్మిం దుడిచికొని బెట్టు నిట్టూర్పువుచ్చి మెల్లన నిట్లనియె.

'రాజనందన! కఠినచిత్తను మందభాగ్యనునగు నాదు జన్మవృత్తాంతంబు విననేల? నీకిందుఁ గుతూహలము గలదేనిఁ జెప్పెద నాలింపుము. నీవు స్వర్గంబున నప్సరలు గలరని విని యుందువు. వారిలో పదునాలుగు కులంబులు గలవు. వీని యందు దక్షకన్యలైన ముని యరిష్టలను వారివల్ల గలిగిన రెండు గంధర్వ కులంబులు రాజిల్లును. ముని కుమారులగు చిత్రసేనా దులలో పదునాఱవవాఁడు చిత్రరథుండని గుణాధికుండు గలఁడు. అతఁడధిక పరాక్రముండగుట మహేంద్రునకు మిత్రుండై గంధర్వులకు నాధిపత్యంబువహించి కింపురుష వర్షంబున హేమకూటంబునందు వసించుచున్నాఁడు. ఆచిత్రర థుండే యిచ్చట చైత్రరథంబను నుద్యానంబు నిర్మించి యిందు వచ్ఛోదంబను కొలనింద్రవ్వించి యిందుధరు నిందుఁ బ్రతి ష్ఠితుం జేసె. మఱి యరిష్టకు పుత్త్రులగు తుంబురు ప్రభృతు లలో జ్యేష్ఠుఁడగు హంసుండు చిత్రరథునిచే రెండవ గంధర్వ కులంబు నాధిపత్యంబున నభిషిక్తుండై హేమకూటంబుననె యున్నవాఁడు. చంద్రకిరణంబుల వలనం గలిగిన యప్సరః కులంబునఁ బొడమిన యతిలావణ్యవతియైన గౌరియను సుకు మారిని హంసుండు పరిణయంబాయెను. అట్టి మహాత్ముల కిద్వురకు నలక్షణురాలను దుఃఖసహస్రంబునకుఁ బాత్రురా లను నైనయేను కర్మకని కూఁతురనై పుట్టితి. నాజనకుం డపు

త్రికుం డగుటంజేసి పుత్త్రిజన్మంబుకంటె నతిశయంబగు మహోత్సవంబుచే నాజన్మంబున భినందించిదశమదినంబున నాకు మహాశ్వేతయని పేరిడియెను. ఏనును పితృభవనంబున శోకాయాసంబు లెఱుంగని శైశవంబు గడపితి. అంతే మదంబుచే మధుకరంబువలెను. మధుకరంబుచేఁ గుసుమంబునలెను; కుసుమంబుచే నవపల్లవంబువలెను, నవపల్లవంబుచే మధుమాసంబువలెను, మధుమాసంబుచే వసంతునివలెను యౌవనంబుచే నా శరీరంబు సొబగొందెను.

అనంతరము మధుమాసదివసంబుల యందొకనాఁడు తల్లితోఁగూడి యచ్ఛోదంబున స్నానము సేయవచ్చి అట ‹అహో! కుసుమాపహారరమ్యంబగు నీలతామండపంబెంత మనోహరముగా నున్నది! సుందరీ! సుందరంబైన యీ చందనవీథి చల్లనై యుల్లంబున నానందము వెల్లిగొలుపుచున్నది, యని నెచ్చెలులతో విహరించుచుంటిని. అంత నొక్కచో వన్య కుసుమపరిమళంబు నిరసించి యతిసురభియగుటంజేసి ఘ్రాణేంద్రియంబుం దనియించెడినోయన వెడలు ననాఘ్రాతపూర్వంబగు కుసుమగంధంబు నాఘ్రాణించి, ఇది యెందుండి వచ్చెనని కుతూహలంబునఁ గొన్నియడుగులు నడిచి యచట విరూపాక్షు వశపఱుచుకొన నెంచి నియమంబుపూనిన కాముండో, బ్రహ్మచర్యంబు నలంకారమో, సకలవిద్యల స్వయంవర పతియోయనఁ దనరి సమాన వయస్కుండగు నింకొక ముని కుమారకునితోఁగూడి స్నానార్థమై యరుదెంచిన యతిమనోహరుండగు మునికుమారకుం గాంచితి. ఆతని చెవిలోన

కుసుమలక్ష్మి యౌవనలక్ష్మియోయీ యదృష్టపూర్వమగు
కుసుమమంజరిగాంచి యుద్యానిపరిమళంబన్యకుసుమగంధంబుం
దిరస్కరించెనని మనంబున నెంచి యక్కుమారు జక్కందనము
నకుం జొక్కి యవలోకింపుచుండ గుసుమాయుధుండు నన్నుం
బరవశంగావించెను. అంత నిట్టూర్పులతోడ నిమేషంబులను
మఱచి నీయధీనురాలనైతినని వచించుదానివలెం గాంచుచు
ఏమిా! ఈయకృత్యము? ఇయ్యది కులకన్యలకుం దగదు. అని
తెలిసియు మనంబు నిల్పనశక్తనై నిశ్చేష్టితురాలనైతి. అనం
తరము స్వేదజలముచేం గడుగంబడియెనోయన లజ్జకరిగిపోయెను
మారశరంబులకు వెఱచెనోయన గాత్రంబు వడంకెను. అప్పుడు
నామనంబున నిట్లు చింతించితి. తపంబులకు నిక్కయగు నీతే
జంబేడ? ప్రాకృతజనాభినందితంబులగు కామసుఖంబులేడ? ఇది
తెలిసియు నేను చిత్తము నాపంజాలను. గానం దెలివి దప్ప
కుండునంతలో నిచ్చోనుండి తొలంగుట శ్రేయము. ఇతండు
తన కనభిమతంబగు నామదనవికారంబుం గాంచి శపించిన
శపింపంగలండు. మునిజనంబునకుం గోపంబు మునిముక్కుననె
యుండుంగదా? యని చింతించి యటనుంచి చననెంచి యత
నికి నమస్కారంబు సేసితి.

అంత మనోభవుండలంఘ్యశాసనుండగుటను, నవయౌ
వనం బవినయబహుళంబగుటను, మనోవృత్తి చపలంబగుటను,
నే నభాగ్యనగుటను పవనుండు ప్రదీపంబునుంబలె మారుండ
క్కుమారునధీరుంజేసి వడంకించెను. ప్రకటంబగు నతని వికా
రంబుంగాంచి మదనావేశం బిమ్మడింప నేను వర్ణింపరాని

యవస్థనొందితి. అప్పు డతనిసహచరుండగు రెండవ ముని కుమారకుఁగని పరిణమిల్లి యిట్లడిగితి. ‹ఈయన పేరేమి? ఏతపోధనుని కుమారుఁడు? ఈతండు చెవిగొనందాల్చిన కుసుమ మంజరి యేమి పేరిటి చెట్టునంగలిగినది? దీని సుగంధము నా మనంబున గౌతుకంబు గలిగించెడిని. అని యడుగ నతఁడు కొంచెము నవ్వి యిట్లనియె:—

---

## ద్వాదశ పరికరణము.

### —( పుండరీక వృత్తాంతము. )—

---

‹బాలా! దీననేమి ప్రయోజనము? ఇందు నీకుఁ గౌతుకము గలదేనిఁ జెప్పెదవినుము. దేవలోకంబున శ్వేతకేతుం డను మహాముని యున్నవాఁడు. అమ్మహానుభావుని రూపంబు నలకూబరు నతిశయించి యుండును. ఒక్కనాఁడమ్ముని దేవతార్చన కుసుమమ్ములుగోయ మందాకినీ జలంబునఁ దిగుటయు నప్పాడాయనను కమలవనంబున నెల్లపుడు వేయిరేకుల తమ్మిగద్దియపై గూర్చుండియుండు లక్ష్మీదేవి కాంచెను. అట్లుగాంచుచు నాతని రూపంబు నాస్వాదించు నద్దేవి చిత్తము మదనాయత్తం బాయెను. దర్శనమాత్రంబుననె సమాగమ సుఖంబుగొందిన యాయమకుఁ దానుండు పుండరీకంబుననె కుమారుండు పొడమెను. అంతనద్దేవి ‹మునీంద్రా! వీఁడు నీ

కొమరుండు గ్రహింపుమని పలికి యబ్బాలకు నా శ్వేతకేతున కొసంగెను. తరువాత నమ్మునీంద్రుండు బాలకునకుఁ దగు సకల కృత్యంబుల నెఱపి యతండు పుండరీకమ్మునఁ బొడమి యుంటఁ బుండరీకుఁడని పేరువెట్టి యుక్తకాలంబున బ్రహ్మ చర్యంబొసఁగి సకలవిద్యల నేర్పెను. ఆపుండరీకుండే యితండు. ఈతని చెవికొననున్న కుసుమం బే చెట్టుదనిన పారి జాతంబు కుసుమమంజరి. దీని నీతండు వ్రతవిరుద్ధంబుగ నెట్లు గ్రహించెననిన, నేఁడు చతుర్దశియని కైలాసవాసియగు నంబి కాపతిని సేవింప సురలోకమునుండి నాతోనితండు నందనవన సమీపంబునఁ బోవుచుండ నందనవన దేవత వసంతలక్ష్మి కరంబువట్టికొని యీపారిజాత కుసుమమంజరిం గైకొనివచ్చి యీతనికిఁ బ్రణమిల్లి 'భగవంతుఁడా! నీరూపునకు నీయలం కారంబు దగును గాన ననుగ్రహించి యిద్దానిం జెవికొన నునిచికొమ్ము, అని వేడిన నీతం డంగీకరింపకున్నను నేను 'మిత్రమా! తప్పేమి? ఈయమ ప్రేమంబున నొసఁగినఁ దీనిం గ్రహింపు' మని బలిమిమై నిద్దాని నీతని చెవికొన నునిచితి. నని పలుకుచుండ నా శ్వేతకేతుసుతుండు 'కుతూహలినీ! ప్ర శ్నాయాసంబుతో నేమి? దీని పరిమళము నీకు రుచించునెడ గైకొమ్మని తన చెవినుండితీసి ప్రార్థనంబలె నా చెవియం దుని చెను. అతని కరతలస్పర్శంబున నాడెందంబు పారవశ్యంబు నొందెను.

ఆమునికుమారుండును నాకపోలతల స్పర్శసుఖంబున వడంకుచున్న వ్రేళ్లవలన లజ్జతోడం జాఱిపడిన జపమాలిక

నేనిఁ దెలిసికొనండాయె. అంతనే నాజపమాల దిగువఁబడ
కుండఁ బట్టుకొని కంఠాభరణంబుం జేసికొంటిని. ఇంతలో
ఛత్రగ్రాహిణివచ్చి 'భర్తృదారికా! దేవి స్నానముచేసెను.
ఇంటికిఁ బోవలయు. గాన నరుదెమ్ము- అనుటయు నెట్టకేలకు
నాతని మోమునుండి చూడ్కిమరలించి స్నానంబునకు వెడ
లితి. ఏను వెడలుచు నాతని ధైర్యచ్యుతింగాంచి రెండవముని
దారకుండు కొంచెము కోపించి యిట్లనియె.

'సఖుఁడా! పుండరీక! ఈమార్గము క్షుద్రజనక్షుణ్ణము
సుమా? నీకుఁదగదు. నీధైర్యంబెక్కడ? ఆయింద్రియ జయం
బెక్కడ? ఆబ్రహ్మచర్యంబెక్కడ? ఆగురూపదేశంబెక్కడ? ఆ
శాస్త్రంబులెక్కడ? చేతనుండిజాఱి యపహరింపఁబడిన జప
మాలికనేని నెట్లు కనుఁగొనవైతివి? ఏమి యీస్మృతిహీనత.
ఆయనార్య జపమాలిక నపహరించుగాక. మఱియు దానిచే
నపహరింపఁబడు చిత్తంబునేని నేలవారింపవు? అనుటయు
నాతండు కొంచెము లజ్జపడి యిట్లనియె. సఖుఁడా! కపింజల!
నన్ను వేఱువిధంబుగఁ దలంచెదేల? ఏనాదుష్టకన్యకచేసిన
యపరాధంబు సహింపను. అని లేనికోపంబు దెచ్చికొని
'చపలా! నాజపమాల నొసంగక యడుగుదాటి కదలకుము.
అనవిని యేనాతని జపమాల నామెడయందు యునిచికొని నా
మెడలోని యేకావళిందీసి యాతనిచేత నునిచి, యటనుండి
వెడలి స్నానంబుచేసి తల్లితో నిజభవనంబుజేరి కన్యాంతః
పురంబు ప్రవేశించి విరహావివశనై యాతనికె యభిముఖనై
యుంటిని.

అంతకుమున్న నాయడకత్తె తరళిక నాతోడ స్నానము
నకు వచ్చియుండెను. అది కొంత తడవునకువచ్చి మెల్లన
నాతోనిట్లనియె. అచ్ఛోద సరసీతీరంబున మనము గనిన
యిద్దరలో నీచెవిలోనఁ గుసుమమంజరి నునిచిన మునికుమా
రుండు రెండవవానికిఁ దెలియకుండ నడవిలో నావెంటనరు
దెంచి భర్తృదారికనుద్దేశించి 'బాలికా! ఆకన్యకయెవ్వరు?
ఎవ్వరికూఁతురు? పేరేమి? ఎటకు బోయెను అనియడిగి తెలిసి
కొని కానుగ్రమ్మానున నొక తలిరుటాకుంగోసి దాని నొకశిలా
తలంబునఁ బిడిచి యూరసంబుచే నొక భూర్జపత్త్రింబునందు న
ఖాగ్రంబున వ్రాసి యీపత్త్రిక నాకన్నియకుఁ జాటుగ నొస
గుమనిపల్కి యిచ్చెను. అని చెప్పి పత్త్రికనొసఁగ నద్దానిం గై
కొని యందు వ్రాయఁబడిన యీగీతముం జదివితిని.

గీ॥ బిసరుహాయత లోచన! బిససితమగు
తరళహార్తిక వల్లిమతల్లిచేత।
హంసముంబోలె నామనం బాసగొల్పి
బేలుపుచ్చియుఁ జేర్చితి చాలదన్న॥

అని యీగీతింజదువుటంజేసి మఱియు వివశనై యుం
టిని. అంత సాయంకాలమగుడు ఛత్త్రగ్రాహిణివచ్చి యిట్ల
నియె:—భర్తృదారిక! ఆమునికుమారులలో నొక్కఁడు నాకి
టనున్నవాఁడై జపమాల వేడవచ్చితినని వచించుచున్నాఁడు.
నావిని యేసుకంచుకి నొక్కనింబిలిచి 'పోయి యాతనిం దో
డ్కొని రమ్ము' అని పలుక వాఁడు గొనివచ్చుటయు, కపింజ
లుంగాంచితి. అప్పుడతం డిట్లనియె:—

రాజపుత్త్రి! ఏమి చెప్పుదు? నావాక్కు వచింపగాని విషయంబున లజ్జచే నడగిపోయెడిని. కందమూలంబులం గుడుచుచు శాంతినొంది యడవియందుండు మునిజనం బెక్కడ? కలుషంబైన మదనరాగం బెక్కడ? ఇయ్యది నారచీరలకుం దగునో? జనులకు యోగ్యంబో? తపంబున కనురూపంబో? ధర్మోపదేశమున కంగంబో యెఱుంగ. ఇది యవశ్యంబును జెప్పవలయు. వేరొక్కగతి లేదు. శ్రీమతియెుకుఱనే నేనట్లు కినుకంబూని కఠినంబుగ వక్కాణించితి. అట్లు పలికి కోపించి యాతనివిడిచి యచ్చోటువాసి వేరొక్క చోటికరిగితి. నీవేగిన పిదప ముహూర్తమాత్రంబుండి యిప్పుడొంటిమెయి నితం డేమిచేసెడినోయని మరలివచ్చి గాంచునంతలో నొక లతా గహనంబుననుండి సర్వవ్యాపారంబులు విడిచినవాఁడగుట లిఖితునివలెను, స్తంభితునివలెను, ననిశంబు గన్నీరుగార్చుచు ఉన్మత్తునివలెను, అంధునివలెను పరాయత్తచిత్తుండై యున్న యాతనింగాంచి డెందంబువడంక నిట్లు చింతించితి. మకరకేతుని వేగంబు దుస్సహంబు. బాల్యంబు మొదలు ధీరప్రకృతియగు నితండు జ్ఞానము నిరసించి తపంబు పోనాడి మన్మథునిచేఁ జడీకృతుండాయె. అన్నివిధముల నిర్దోషంబగు యౌవనంబు దుర్లభంబు. అనియెంచి సమీపంబునఁ గూర్చుండి సఖుఁడా! పుండరీక! ఇదియేమి? చెప్పుము, అని యడిగిననంత నతండు నన్నుగాంచి కపింజల! వృత్తాంతం బెఱింగియు నన్నడిగెదవేల? అని పలికెను. అదివిని యేను సఖుఁడా! పుండరీక! ఏనెఱింగియు నిదియే యడుగుచున్నాఁడ. నీవెట్టి

యారంభించితో, అది గురువులచే నుపదేశింపఁబడి యెనా? ఇఁక ధర్మశాస్త్రములయందుఁ జెప్పఁబడియెనా? మఱి యిది స్వర్గగమనమార్గంబా? ప్రతరహస్యంబా? ఇంద్రియంబుల వారింపవేల? మనంబు నియమింపవేల? ధైర్యమవలంబింపుము, నావిని యతండిట్లనియె.

సఖుఁడా? కపింజల? ఎవ్వని కింద్రియంబులు, మనంబును స్వస్థంబులో మఱియెవ్వఁడు ఇదిమంచి, ఇది చెడుగని వివేచింప నర్హుండో, వాఁడుకదా? ఉపదేశమునకు యోగ్యుఁడు నాకు జ్ఞానము, ధైర్యమునను వార్త యస్తమించెను. ఏమిచేయుదు? చిత్తంబు నాపఁజాల. కానఁ బ్రతికియుండునందాఁక నీ మదన సంతాపంబునకుఁ బ్రతిక్రియ సేఁయగోరెద. నా యంగంబు లుడికెడిని. శరీరంబు మండెడిని, అని పల్కెను. అంత నేనిట్లు చింతించితి. సమయంబు దప్పెను. ఇప్పు డుపదేశంబులు నిరర్థకంబులు. మంచియో, చెడుగో, ఏదేనొక యుపాయంబున నీతని ప్రాణంబుల రక్షింపవలయు. దానికి నీసమాగమంబుదక్క నొండుపాయంబు లేదు బాలభావంబునను అప్రగల్భ్యంబునను నితం డాకన్నియయున్న యెడకుంజని మనోరథంబు నించికొనం జాలఁడు. మదనవికారంబు కాలాంతరంబు సహింపదు. సాధువు లతిగర్హితంబగు నకృత్యంబుననైన సుహృత్ప్రాణంబులు రక్షింపనెంతురు. ఇంకేమి చేయవలయు? ఆయమయొద్దకుఁజని యీయవస్థ నివేదించు వాఁడనని యాలోచించి యిటకు వచ్చితి. కాలం బతిక్రమించెను.

అన్ని విధముల సుహృత్ప్రాణ రక్షణంబునకై యిదొ దోసిలి యొగ్గుచున్నాఁడ. ననిపల్కి వెడలిపోయెను.

అప్పుడేమియుం జేయఁదోపక తరళిక నిట్లడిగితి. తరళిక నాడెందం బాకులపాటొందెను. ఇందేదియుక్తమో అది నీవ యుపదేశింపుము. కపింజలుండు నీయెదుట నయట్లు చెప్పిపోయెగదా? ఇతర కన్యకవలె నేను లజ్జనుద్యజించి అవినయం బంగీకరించి సదాచారంబు నుల్లంఘించి అయశంబునకొప్పి రాగాంధనై తండ్రిచే ననుజ్ఞగొనక తల్లిచే ననుమోదింపఁబడక నాయంతన వెడలి మునికుమారు పాణిం గ్రహించు నెడ గురుజనాతిక్రమణంబున గొప్ప యధర్మంబు వాటిల్లును. ఇఁక ధర్మానురోధంబున మరణము నంగీకరింతునేని మాత్రమ తంబైన యాశాభంగంబున మునిసూనుం డసువుల దొఱఁగు నెడ నందున మునిజనవధ జనితంబైన మహాపాతకంబుగల్గును. అని బలుకుచు చంద్రుండుదయింప మూర్ఛనొందితి. అంతఁ దరళిక చేసిన శిశిరోపచారములచేఁ దెప్పఱిలి యేడ్చుచున్న తరళికం గాంచితి. అప్పుడు తరళిక యిట్లనియె.

‘భర్తృదారిక! లజ్జతోనేమి? గురుజనాపేక్షతోనేమి? ప్రసన్నవగుము. నన్నంపుము. నీప్రియతముని నిటకుంగొని వచ్చెద. లేదేనిలెమ్ము. నీవైన నటకుఁబొమ్ము. అనుటయు దానింబట్టుకొని యేరికి నగపడకయ మేడనుండిదిగి వెడలు నంతలోఁ గుడికన్నదరఁ దొడఁగెను. అదిలక్షించి దైవంబింకెద్దియో సంకల్పించెనని యెన్నుచు వెడలి యచ్చోటుడాసితి. అంతలో పురుషుని రోదనధ్వని నాలించితి. మొదట కుడి

కన్నదరుటం జేసి యహితము నాశంకించు చున్నదాన నా ధ్వనిచే మిగుల గుండియ వగిలినట్లు విషణ్ణచిత్తనై తరళిత నై! ఇదియేమి? అని భయంబున వణంకుచు నెదురుగఁ ద్వరితగతి నరిగితి. అప్పుడు నిశీధ సమయంబగుట నార్తనాదంబు దూరం బునకు వినవచ్చె.

«హా! హతుఁడనైతి. హా! ఇదియేమి? ఇట్లు వచ్చె. దురాత్మా! మదనపిశాచ! నిర్దయ! ఈయకృత్యము సేసితి వేల? ఆ! పాపా! మహాశ్వేతా! నీకితండేమి యపకృతియొన ర్చె? ఆ! చంద్రిచండాల! కృతార్థుండవైతివి. హా భగవంత! శ్వేతుకేతూ! పుత్రవత్సల! చెడిన నిన్నెఱుంగవైతివి. సఖుఁడా! నిన్నువిడిచి క్షణమైన నుండఁజాల. నీవెంటవచ్చెద నిలుము. ఎవ్వనితో దిరుగుదు? ఎవ్వనితో భాషింతు? అను కపింజలు నాలాపంబు నాలించితి.

అంత నగసిపోయెడు నసువులతో నెలుంగెత్తి యేడ్చు చుఁజని పాపకారిణి నగు నేను తలిరుసెజ్జపై నరంగ యోగ విద్యను ధ్యానించువానివలె నుండి కంఠంబునఁ గపింజలునిచే గౌగలించు కొనఁబడి యప్పుడ విగత జీవితుండైన యమ్మహా భాగునిఁజూచితి. మూడనై మూర్ఛాంధకారంబు గప్పుటఁ బాతాళంబున కేగినదానివలె నప్పుడెందుంటినో ఏమి విల పించితినో ఏదియునెఱుంగ. కొంత దడవునకుఁ దెలివిగాంచి యిదియేమి? యిట్లువచ్చెనని పేరెలుంగున «హా! తల్లీ! హా! తండ్రీ! హా చెలులారా? అనుచును, హానాథ! దిక్కులేని నన్నొంటిగ విడిచి యెటబోయెదో వచింపుము. నీకై యొ

యవస్థనొందితినో తరళిక నడుగుము. ఒక్కమాత్రైన మాటా
డుము. ఆర్తనైతి. అనాథనైతి. ఆ! నాకతనసీకిట్టి దశవాటి
ల్లెను. ఇట్టి నేనింకను బ్రదికియున్నదాన. నాకు వినయంబును
పరలోకంబునులేదు. ఇట్టినిన్నువిడిచి గృహంబున కేగితినిగదా?
ఇంకనాకు గృహంబుతోనేమి? తల్లితోనేమి? తండ్రితోనేమి?
హా! దైవమా! భర్తృభిక్షువెట్టుము. తండ్రీ! కైలాసనాథా!
దయాళుతం గనంబఱుపుము. అనివిలపించితి. ఏనప్పుడు మర
ణంబ నిశ్చయించి తరళికతో నిట్లంటిని. ఓసీ! లెమ్ము. ఎంత
సేపేడ్చుదాన? కట్టియలంగొనితెచ్చి చితంబేర్చుము. జీవి
తేశ్వరు ననుగమించెద" ననుటయు నంతలోఁ జంద్రమండ
లంబునుండి మహాప్రమాణుండగు నొక దివ్యపురుషుండు
వెడలివచ్చి మృతుఁడైన పుండరీకుని శరీరంబు నెత్తుకొని
గంభీరస్వరంబుతో 'వత్సా! మహాశ్వేతా! నీవు ప్రాణంబుల
విడువకుము. మగుడ నీకీతనితో సమాగంబు గలిగెడిని. అని
తండ్రివలె నాదరించి పలికి గగనతలంబున కెగసెను. అంత
నేను భయంబును విస్మయంబును దోప మొగంబెత్తి 'ఇదియే'
మని కపింజలు నడిగితి. అతండు నాకు మాఱు పల్కకయ
'దురాత్మా! అంతక! నా నెచ్చెలి నెచ్చటికిఁ గొనిపోయె' దని
కోపించి యాతనివెన్నంటి గగనతలంబున కెగసెను. ఏను
చూచుచుండగనె వారందఱు దారామండలంబునఁ బ్రవేశిం
చిరి. ఏమియుఁదోఁచక 'ఇదియేమో యెఱుంగుదువా?' అని
తరళిక నడిగితి. అదియు భయంబున నడంకుచు నేను మర
ణింతునని యెంచి దీనంబుగ నిట్లనియె:—

'భర్తృదారిక! పాపాత్ముఁరాల నేమియు నెఱుంగ. ఇది గొప్పవింత. దివ్యపురుషుండు తండ్రివలె నిన్నాదరించెను. అట్టివారు స్వప్నంబునఁ జెప్పిన వచనంబులును నిక్కంబులగు. ప్రత్యక్షంబుగఁ జెప్పిన వానిగుఱించి యేమిచెప్పవలయు? మఱియుఁ గపింజలుండాతని వెన్నంటిపోయెను. అతనివలన నితండెందుఁడివచ్చెనో, ఏల పుండరీకుని శరీరంబు గొనిపోయెనో, ఏల పునస్సమాగమంబున నాశపెట్టెనో ఇదియంతయు నెఱింగి యప్పుడు జీవితంబో, మరణంబో నిశ్చయింపనగు. మరణంబు సుఖంబు. ఇయ్యది యెఱింగినపిమ్మట కాగలదు. కాన గపింజలుండు వచ్చునంతకు ప్రాణంబుల ధరింపుము. అని పాదములపై వ్రాలెను.

ఏను జీవితాశదుర్లంఘ్యంబగుట, 'అప్పుడదియెయుక్తంబని యెంచి జీవితంబు విడువనైతి. ఆశచేనేమిచేయరు? తరళికతో నేడ్చుచు నా రాత్రిగడపి ప్రభాతంబుననె లేచి యాకొలనిలో స్నానంబుచేసి నిశ్చయంబు చేసికొని మునికుమారునిప్రీతికై కూకమండలువును ఆనారచీరలను అజపమాలను గ్రహించి సంసారంబు నిస్సారంబని యెఱింగి, ఏనపుణ్యాననియెంచి స్నేహంబు బహుళ దుఃఖంబని వితర్కించి సకలంబు ననిత్య మని నిశ్చయించి తలిదండ్రులఁ ద్యజించి త్రైలోక్య నాథుం డును, అనాథశరణుండునైన పరమేశ్వరు శరణుఁజొచ్చితి. మఱునాఁడీ వృత్తాంతంబు నెఱింగి నాతలిదండ్రులు బంధువర్గం బుతో నరుదెంచి చాలసేపు రోదనంబుసేసి పెక్కునుపాయం బులచే నన్నింటికిఁ గొంపోవ నుద్యమించి విఫలయత్నులై

సశోకులై గృహంబున కరిగిరి. అది మొదలు నేను దీర్ఘశో
కంబు ననుభవించుచున్నదాన. ఏనిట్టిపాపిని. బ్రాహ్మణవధ
మహాపాతకంబు చేసిన నన్నుఁగనినను పలుకరించినను మహా
భాగున కేమి ప్రయోజనము? అనిపల్కి చీరకొంగున మోము
చందురుం గప్పికొని శోకవేగంబు నాపరామి నెలుంగెత్తి
యేడ్చెను.

చంద్రాపీడుండు మొదల రూపంబునకు, వినయంబు
నను, తపస్విత్వంబునను నాయమయందు గౌరవంబు గలిగి
యుండుటఁ దద్వృత్తాంత శ్రవణంబున నిగులదయార్ద్రహృద
యుండై మెల్లన నిట్లనియె.

భగవతి! అనభిజ్ఞుండు స్నేహసదృశంబగు కృత్యము
సేయనేరక యూరక యేడ్చుచుండును. కర్మంబుచేతన సర్వం
బునాచరించు నీవు రోదనము సేయనేల? తృణప్రాయంబుగ
విషయ సుఖంబుల విడనాడితివి. తపంబునఁ జిత్తంబు జొనిపి
తివి. అను మరణంబనునది యతినిష్ఫలంబు నజ్ఞాన పద్ధతియు
నగు. అయ్యది తన యసహ్యశోకంబునకుఁ బ్రతీకారంబుగాన
స్వార్థంబకాక మృతునకు లాభకరంబుగాదు. ఇది మృతినొం
దినవానిఁ గ్రమ్మఱఁ బ్రదికించు నుపాయంబా? పుణ్యలోక
ప్రాప్తిహేతువా? పరస్పర సమాగమనిమిత్తంబా? ఇందే
దియుఁ గాదు. జీవించియున్నవాఁడు మృతునకుఁ జలాంజలి
దానాదుల నుపచరించుంగాని యనుమరణంబు చేసినవాఁడీ
ద్వరకు ననుపకారకుండగును. భర్తయైన మకరకేతనుండు
మృతినొంద రతీదేవి ప్రాణంబులువిడిచెనా? కిందముముని

శాపంబునఁ దనపతి పాండుమహీపాలుం డసువుల గోల్పోయిన యెడఁ గుంతీదేవి మృతినొందెనా? అభిమన్యుఁడు నిహతుఁడైనపుడు విరాటపుత్త్రి యుత్తరదేహంబు ధరింపదయ్యెనా? ఇట్లెందఱో భర్తృరహితలు గలరు. ఈవు మగుడ భర్తృసమాగమంబు గలుగునని వినియుంటివి. అట్టి మహాత్ముల వచనంబులు వితథంబులగునే? నిస్సంశయముగ నిమ్మహాత్ముండె క్రిమ్మఱఁ బ్రదికింపనె యతని నెత్తికొని సురలోకంబునకు గొనిపోయె. అట్లుగానియెడ నాతనిం గొనిపోవనేల? ఇకను నేమిసేయవలయు? తఱుచుగ స్వభావంబుననె సుఖంబులు క్షణికంబులును, దుఃఖంబులు దీర్ఘంబులునై యుండు. అట్లు ప్రాణులకొక్కజన్మంబున సమాగమంబును, పెక్కుజన్మంబుల యందు విరహంబును భోగ్యంబగు. సంసారపథంబునఁ జరించు వారలకీవృత్తాంతంబులు రాకమానవు. ధీరులాపదం దరింతురు గదా? అనిపల్కి యోదార్చెను.

అంతలో మహాశ్వేతావృత్తాంతంబువిని శోకంబునొందెనోయన దినకరుండస్తమించెను. పదంపడి చంద్రాపీడుండు సాయంసంధ్యనుపాసించియిట్లులడిగెను. భగవతీ! నీపరిచారిక తరళిక యెటకేగెను? అనుటయు నాయమ మగుడ నిట్లనియె:—

---

## త్రయోదశ ప్రకరణము.

### — కాదంబరీ వృత్తాంతము. —

మహాభాగ! మున్నుజెప్పిన పదునాలుగు నప్సరఃకులములలో నమృతసంభవంబైన దొక్కటికలదు. ఆకులంబున

మదిరయను కన్యకజనించెను. ఆకన్యకను చిత్రరథుండను గంధ
ర్వరాజు పరిణయంబాయెను. వారికిఁ గాదంబరియను కన్యా
రత్నంబుదయించెను. ఆకన్నియ జన్మంబు మొదలునాకు బాల
మిత్రంబయియుండెను, ఆజవ్వనియు నిట్టి నావృత్తాంతంబుచే
శోకాకులయై, మహాశ్వేత దుఃఖితయైయుండ నేను పాణిగ్రహ
ణంబు సేసికొనను, అని నెచ్చెలులయెదుటఁ బ్రతిన సేసెను.
మఱియు, ఏ నంగీకరింపకున్నను నాతండ్రి బలాత్కారంబున
నొక్కని కొసంగునెడ నప్పుడేనుఅనశనంబుననో, విసంబుననో.
నియతంబుగ దేహంబు దొఱంగుదు? ననియు నిశ్చయంబు సే
సెను. అదివిని చిత్రరథుండు కాలంబుగడచుచుండఁ గూఁతుం
బరిపూర్ణయౌవనంగాంచి చింతించి, అదియొక్కర్తుకయ పుత్త్రి,
యగుటనేమియుఁ జెప్పవెఱచి యొకయుపాయంబువన్ని, మహా
శ్వేతా! నీకైవగచు మాకు నింకొక దుంఖం బుపస్థితంబయ్యె.
ఇప్పుడు కాదంబరికి బోధింపనీవదిక్కు? అని నాకుఁజెప్పుమని
కంచుకి నొక్కనిఁ బనిచెను అంతనేను గురువచన గౌరవంబు
నను, సఖీప్రేమంబునను, సఖీ! కాదంబరి! దుఃఖంచు నన్ను
మఱియు దుఃఖపెట్టెదవేల? ఏ జీవించియుండ నిచ్చగించెదేని
గురువచనం బాచరింపుమని చెప్పి యాకంచుకితోఁ దరళిక సని
చితి. అదిచనిన కొంతదడవునకు నీవిందుల కరుదెంచితివని
వాకుచ్చెను.

అప్పుడు చంద్రాపీడుండు పల్లవశయనంబున శయనిం
చి "వైశపాయనుండు నన్నువిడిచి యేమియాలోచించుచుండె
నో, పత్త్రలేఖ యేమిచేయుచుండెనో, రాజపుత్త్రలోకంబేమి

తలంచుచుండెనో, అని చింతించుచు నిద్రించెను. ఆరాత్రి
కడచన నుషఃకాలంబున మహాశ్వేత లేచి స్నానంబుచేసి
జపించుచుండెను. చంద్రాపీడుండును కాల్యకృత్యంబు నిర్వ
ర్తించెను. అంతఁ దరళిక కేయూరకుఁడను గంధర్వ కుమారు
నితో నరుదెంచి 'ఈతండెవం' డని రాజనందనుంగాంచుచు
మహాశ్వేతయొద్దకునచ్చి ప్రణమిల్లి సవినయంబుగఁ గూర్చుం
డెను. పిమ్మటఁ గేయూరకుండును ప్రణామంబు సేసి కూర్చుండి
చంద్రాపీడుంగాంచి యతని రూపంబున కచ్చెరువందుచుం
డెను. జపంబు పరిసమాప్తినొంద మహాశ్వేత తరళికంగాంచి
'ప్రియసఖియైనఁ గాదంబరిం గంటివా? కుశలంబుగ నున్నదా?
నీమాట నంగీకరించెనా? అనియడుగ నాతరళిక యిట్లనియె:-
'భర్తృదారికే! కాదంబరింగాంచితి. కుశలంబున్నది. సకలంబు
విన్నవించితి. నావచనంబువిని రోదనంబు సేసి కేయూరకు
నితో నిట్లుచెప్పి పుత్తెంచెను. అతండు వచింపఁగలఁడు. అని
పల్కి యూరకుండెను. అంత గంధర్వకుమారకుండిట్లనియె:-

భర్తృదారిక! మహాశ్వేత! కాదంబరీదేవి నీకంఠంబు
గౌగిలించికొని విన్నవించెడిని. ఈతరళికవచ్చి యెద్దిచెప్పెనో,
అద్ది గురువచన నిరోధంబునఁ జెప్పఁబడియెనా? నాచిత్తంబుం
బరీక్షింపనా? గృహంబున నుంటినని నిపుణంబుగ దూషించు
టయా? ప్రకోపంబా? చెప్పుము. నాహృదయంబు నెఱుంగవా?
ఇంతకఠినంబుగ నెట్లుచెప్పియనిచితివి. అట్టి మధురభాషిణివి
ఇట్టి యప్రియంబు పరుషంబునాడ నెచ్చట నేర్చితివి? మనంబు
సుహృద్దుఃఖంబున దుంఖితంబై యుండ సుఖాశయెట్లు పొడ

మెడిని? నాప్రియసఖి భర్తృవిరహంబున గొప్పకష్టం బనుభ
వించుచుండ సుఖంబుగోరి యెట్లు పాణిగ్రహణంబు సేసికొం
దును? నాకు సుఖంబెట్లు గల్గును? నీయందలి ప్రేమంబున
నికార్యంబు విషయంబునఁ గన్యాజనంబునకుం దగని స్వా
తంత్ర్యం బవలంబించి యపకీర్తిఁ గొప్పితి. వినయంబుం దెగ
డితి. గురువచనంబు నుల్లంఘించితి. లజ్జ విడనాడితి. లోకాప
వాదంబు సహించితి. కాన మగుడ నెట్లిందుఁ బ్రవర్తిం
తును? కాన నిదెయంజలి సేసితి. నన్ననుగ్రహింపుము. ఈ
యర్థంబు మనంబున నుంపకుము, అనిపల్కి మిన్నకుండెను.

అదివిని మహాశ్వేతయుఁ గొంతదడ వాలోచించి యేన
వచ్చి తగునట్లాచరింపఁగలనని పల్కి కేయూరకుననిపి చం
ద్రాపీడునితో నిట్లనియె:—‹రాజపుత్త్రి! హేమకూటంబు
రమణీయంబు. చిత్రరథుని రాజధాని యతిచిత్రము. గంధర్వ
లోకము గడుసుందరము. కాదంబరి మహానుభావురాలు.
అచ్చటికేఁ తెంచుట యతిఖేదకరంబుగాదని తలంచెదేని, నీచి
త్తం బదృష్టవిషయంబునఁ గౌతుకంబుగలదేని, నీవు నావచ
నంబాదరించెదేని నాయభ్యర్థనంబు విఫలంబు సేయకుము.
నాతోడన హేమకూటంబునకు విచ్చేసి యందుఁ గాదంబరిం
గాంచి నేఁడిచట విశ్రమించి రేపకడన నత్తువుగాక. అకారణ
బాంధవుండవైన నీకు వినిపింపగనె నాశోకంబు కొంతదీఱినయ
లున్నయది. సజ్జనసమాగమంబులు దుఃఖితులకుఁగూడ సుఖ
హేతువులుగదా? అన విని చంద్రాపీడుండిట్లనియె:—నీదర్శ

నంబు మొదలుకొని యేను పరాధీనుండనైతి. కృత్యంబుల
యందు నన్ను నిస్సంశయముగ నియోగింపనగునని పల్కెను.

---

## చతుర్దశ ప్రకరణము.

॥ కాదంబరీ దర్శనము. ॥

---

అంతఁ జంద్రాపీడుండుమహాశ్వేతతో నయ్యాశ్రమంబు
వెలువడి హేమకూటంబుఁ జేరి గంధర్వనగరంబు సొచ్చి సప్త
కక్ష్యాంతరంబులఁ గడచి కన్యాంతఃపురద్వారంబున కేతెంచు
టయు మహాశ్వేతంగని ప్రతీహారి దూరంబుననె ప్రణమిల్లి
తెలువెఱిఁగించుచుండ లోనఁబ్రవేశించి స్త్రీమయంబైన
రెండవ జీవలోకంబో, అంగనాద్వీపంబో, యనఁదనరి, శృం
గారమయంబో, సౌందర్యమయంబో, ఆశ్చర్యమయంబో, సౌకు
మార్యమయంబో, ప్రేమమయంబో, యననొప్పునంతఃపురా
భ్యంతరంబుంగాంచెను. అచ్చటి కన్యకాజనంబునకు లోచ
నంబులె కర్ణోత్పలంబులు. ఆలాపంబులె తంత్రీనినాదంబులు.
కరతలంబులె లీలాకమలంబులునగు. అట్టి యువతీ జాలంబుం
గనుచు వారల యాలాపంబు లాలించెను. లవలిక ! నేడగి
పుష్పాడిచే నీతీవియలకుఁ బాదిగట్టుము. రజనికా! చీఁకటి
ప్రమాఁకుల బాటలలో రతనంపు దివ్వియలం బెట్టుము. కుము
దికా! చిలుకలు వొడువకుండ దాడిమీఫలంబులకు ముత్తియ
ములం గూర్పుము, అని యొండరులం బిలుచు మదవతుల

పలుకులు వినుచుఁ గాదంబరీ భవన సమీపంబునకుఁజని చం
ద్రశాలామధ్యభాగంబున ననేక సహస్రసంఖ్యంబైన కన్యకా
జనంబు పరివేష్టింప నల్లనికప్పడంబున నొప్పు పాన్పుపై నుండి
కుబ్జంగలనున్న కేయూరకుంగాంచి 'అతండెవ్వాఁడు? అతని
పేరెయ్యది? రూపమెట్టిది? ఏవయసువాఁడు? బాగుగఁ జూచి
తివా? అతనికి మహాశ్వేతతోఁ బరిచయమెట్లుగలిగెను? ఇటకు
వచ్చునా? అని తన వృత్తాంతంబ యడుగుచున్న కాదంబరిం
గాంచెను. అంతఁ దనమనంబున నిట్లుతలంచెను. 'ఆహా!
తమ్మిచూలి తక్కటి నాయింద్రియముల నెల్లఁ గన్నులుగా నేల
యొనర్పఁడాయెను? ఇన్నాతింజూడ మున్నీకన్నులేమి పున్ని
యంబు సేసెనో? ఎంత చిత్రము! అక్కంజభవుండెల్ల సొబగుల
కొక యిక్కపాదు కొల్పెను'. అని పలువితంబులఁ జింతించు
చుండ నక్కాంతచూపులు రాజనందనుపయింబడియెను. అప్పు
డమ్మదవతి 'కేయూరకుండు చెప్పిన యప్పురుషుఁడీతండ' యని
యెంచి యతని రూపాతిశయంబున కచ్చెరువొందుచుండెను.

అట్టులకాదంబరీ కటాక్షవీక్షణంబు పయింబడిన
యాక్షణంబున క్షోణీశతనయుండు వివశుండై యబలునివలె
నుండెను. ఆ రాకుమారు విలోకింపఁగనె మున్ను రోమాంచం
బును? పిదప భూషణరవమ్మును, పదంపడి కాదంబరియు నుద్గ
మించెను. అట్లు చిత్రరథనందన కష్టంబుగఁ గొన్ని యడుగు
లిడి మహాశ్వేతంగౌగిలించికొన నమ్మగువయు నెచ్చెలిం గౌగి
లించికొని యిట్లనియె— 'సఖి! కాదంబరి! భారతవర్షంబున
రక్షిత ప్రజాపీడుండగు తారాపీడుండను రాజవరేణ్యుండు

గలఁడు. అతనికిఁ బరిహృత వసుంధరాపీడుండైన యీచంద్రా
పీడుండు కొమరుండు. ఇతండు దిగ్విజయప్రసంగంబున నీభూ
మికి వచ్చెను. కనఁబడినది మొదలీయనఘుండు నాకు నిష్కా
రణబాంధవుండై నాచిత్తవృత్తి నాఁచికొనియె. నావలె నీవును
తమ్మిచూలి సృష్టికౌశలంబును, సకలవిద్యల ప్రాభవంబును
మానవుల నాగరకతను దెలిసి యగ్గింపఁగలవని యిచ్చటికి
విచ్చేయ వేఁడితోడి తెచ్చితి. నిన్నుగుఱించి యీతనికిఁ బలు
దెఱంగుల విన్నవించియుంటిని. కాన మున్నుగన్నవాఁడు
కాఁడని లజ్జింపక, అజ్ఞాతశీలుండని సంశయింపక నాయందుం
బలె నితనియందు వర్తింపవలయు. ఇతండు నీకుమిత్త్రుండును,
బాంధవుండు నగునని నివేదించెను. కాదంబరి మహాశ్వేతతోఁ
బర్యంకంబునఁ గూర్చుండ బరిచరులు గొనివచ్చి యునిచిన
పీఠంబునఁ జంద్రాపీడుం డుపవిష్టుండాయెను. అప్పుడాయన్నువ
మహాశ్వేతతో భాషించుచున్నను కడకంటిచూపులచేఁ జం
ద్రాపీడునినె కాంచుచు నతని పయిఁబర్విన చూడ్కి మరల్పఁ
జాలకుండెను. అంత ముహూర్తమాత్రంబున మహాశ్వేతకుఁ
దాంబూలంబు నొసఁగ నుద్యమించుటయు నాయమ కాదంబ
రితో నిట్లనియె—సఖి! కాదంబరి! మనకందఱకును క్రొత్తగ
వచ్చిన చంద్రాపీడుండు పూజనీయుండు. కాన నీతని కొసం
గుము; అనుటయు మోమువాంచి మెల్లగ, ప్రియసఖి! పరిచ
యము లేమింజేసి నాకు లజ్జపొడమెడిని. నీవ కైకొని యీయుమన
కొసంగుము; అనిపలికి యాయమచేఁ బలుమాఱు బోధింపఁబడి
యెయ్యకొని మహాశ్వేత ముఖంబున నునిచిన తనచూడ్కి

మరల్పకయ యొడలువడక బెట్టుగనిట్టూర్పుచు చెమ్మటగ్రమ్మి స్వేదజలంబున మునుంగుదునను భయంబునఁ జేయిఁబట్టుకొనుమని యాచించుదానివలెఁ దాంబూలగర్భంబైన హస్తపల్లవంబు సాఁచెను.

చంద్రాపీడుండును విజయగజ కుంభసమ్మర్దంబున సిందూరంబంటినఁ బాటలంబయి, స్పర్శలోభంబున సరాగంబులై యొక్కచోఁ జేరినట్లైనదగు నింద్రియవృత్తులో యనఁ దనదువ్రేళ్లతో నొప్పుపాణికమలంబుం జాఁచెను. అప్పుడు తత్కాలసులభంబులైన విలాసంబులఁజూడ వేడుకపడియెనన నెటనుండియో వచ్చి సకలరసంబు లామదవతి నధిష్ఠించెను. అంతగాదంబరికంపంబునంగడలు కడియంబులయులివున సంభాషించు చుండెనన నొప్పుహస్తాంబుచే స్వేదసలిలదానపూర్వకంబుగ మదనునిచే నీదాసజనం బొసంగఁబడియెనని ప్రతిగ్రహింపఁ జేసెనోయనఁగను, ఇది మొదలుకొని నీహస్తంబున నుండునని జీవితంబు నునిచెడినోయనఁగను దమ్మలం బొసంగెను. అప్పుడు తన కరకిసలయంబు ముడుఁచుచు హృదయంబుంబలె పడిపోయిన మణివలయంబు నెఱుంగదాయె. వేఱొండు తాంబూలంబుగైకొని మహాశ్వేత కొసంగెను.

అంత మహాశ్వేత కాదంబరి ప్రాసాదంబు సమీపంబున నున్న ప్రమదవనంబునఁ దెలుఁగు మణిభవనంబునఁ జంద్రాపీడు నుండఁబనిచి తాను గంధర్వరాజుం జూడ నరిగెను.

# పంచదశ ప్రకరణము.

## శేషహార సమ్మానము.

చంద్రాపీడుండు కాదంబరి రెండవ డెందం బనఁదనరు మణిమందిరంబునఁ బ్రవేశించి స్నానంబు, దేవతార్చనంబు, నాహారంబును నిర్వర్తించి యుండునంత పాలమున్నీటిచేఁ బుడమి దేలింపఁ బడియెనో, చందనరసంబుచే దిగంతంబులు దడుపంబడియెనో, చందురుం డుదయించెనో యన ధవళప్రకాశంబుంగాంచి కుతూహలంబున నద్దెసం జూచుచుండెను. అంత బెత్తంబును గంధపుగిన్నెయుఁ గొని ప్రతీహారియు, పాము కుబుసంబువలె వెల్లనైయుండు దినం బాలుకల్పలతా దుకూలంబులం బట్టుకొని కేయూరకుండును దారిఁజూపుచుండ, జాజిపూదండం గైకొని తమాలిక వెంటరా ననేకకన్యకాజనంబుం గూడి ఛత్రచామర విరాజితయై యేతెంచిన మదలేఖను, నాయమ చెంగటనున్న తరళికనుం గాంచెను. ఆతరళికా హస్తంబునందుఁ జంద్రునితోఁ బుట్టువో, శ్రీదేవిహాసంబో, సర్వరత్నంబులకు గురువో, ఒక్కచోఁ గుంపుగూడిన యశోరాశియో యనందగు హారంబుంగాంచి యేను గనిన తెలిచాయ కిద్దియె కారణంబనియెంచి ప్రత్యుత్థానాదులచే మదలేఖం గారవించెను.

ఆ మదలేఖయు మరకత శిలాతలంబునఁ గొంత దడవు గూర్చుండి తానలేచి భూమీశతనయునకుఁ జందనం బలఁది

మాలతీ కుసుమమాలిక సిగకుఁజుట్టి వెలిదువ్వలువ నొసఁగి హారంబు చేఁగొని యతనితో నిట్లనియె:— «రాజకుమార! నీరూపం బెవ్వనిఁ బ్రీతి పరవశునిం గావింపదు? ఈయాకృతి చే నెవ్వానికిఁ జీవితేశ్వరుండవుగావు? అకారణ వత్సలంబైన నీచరితం బెవ్వారికి బంధుత్వంబు నారోపింపదు? సహజ కోమలంబులైన నీ గుణంబుల కెవ్వారు కట్టువడరు?

ఇట్లు సద్గుణాలవాలంబవైన నీయెడ నేమొనరించు నుపచారంబె యనుచితంబని తోఁచెడిని. ఎటులన, సంభాషణంబును తిరస్కారంబును సూచించును. ఆదరంబును బ్రభుత్వాభిమానంబు ననుమానింపఁ జేయును. ఉపచారంబును జపలత్వంబు నెవెలిపుచ్చును. విజ్ఞాపనంబును బాల్యంబును దెలుపును. దానంబును బరిభవంబయగు. తనయంతన మనంబునె గ్రహించిన జీవితేశ్వరున కేమి యర్పింపనగు? రాకచే తనమహోపకారంబు సేసిన నీకుఁ బ్రత్యుపకారం బేమి సేయఁగలము? దర్శనం బొసఁగి మాజీవితంబు సఫలంబు సేసిన నీయాగమనం బెద్దానిచే సఫలంబగు? కాదంబరీదేవి యిట్లు తన కూర్మిం జూపెఁగాని తన విభవంబుంగాదు. ఆకన్నియ నీదాస్యమున కంగీకరించియు నకార్యకారిణిగాదు. తన్నె నీకొసంగియు మోసపోదు. జీవితంబు నర్పించియు పశ్చాత్తాపంబు నొందదు. జంబుగ నీయెడ నపరాధంబు సేసిన ట్లెన్నుచున్నది. కాన ద్ది క్షీరసముద్రంబున సర్వరత్నంబుల నుద్ధరింప శేషించెను గాన శేషహారంబని ప్రసిద్ధిఁగాంచెను. దీనిం జలనిధి వరుణున కర్పించెను. వరుణుండును గంధర్వరాజున కొసంగెను. అతండు

గాదంబరి కిడెను. ఆయమయు సుధాకరునకు గగనతలంబ యుచితంబైన పగిది నిద్దానికి నీతనువె యుచితంబని పనిచెను. మిముంబోటి సుగుణాభరణులు బరువుచేటైన యిట్టి యాభరణంబులం దాల్పరు. ఐన నిందు గాదంబరిప్రీతియె కారణంబు. భగవంతుండగు చక్రపాణి లక్ష్మికిఁ దోఁబుట్టువని యెంచి యురంబునఁ గౌస్తుభంబను శిలాశకలంబుం దాల్పఁడె! కాన నీబహుమానంబు నాదరంబునం గ్రహింపనగు. నీవిద్దాని నూల్కొనకుండువేని నక్కాదంబరి మహాశ్వేత నుపాలంభంబులచే నాయాసపఱిచి తనువుదొఱంగును. దానన మహాశ్వేతయు నిట్లుచెప్పి యీహారంబుం దరళిక కొసఁగిపంపెను. మహాభాగ! కాదంబరిదగు ప్రథమప్రణయంబు భంగంబు సేయకుము.” అని పలికి యా హారంబు నతని వక్షస్థలంబున నలంకరించెను.

అత్తఱిఁ జంద్రాపీడుం డచ్చెరువొంది సబహుమానంబుగ నిట్లనియె—మదలేఖా! మాటాడుట కెడమియ్యక యిట్లొప్పి కోలుగావించిన నీజాణతనం బేమనవలయు? కలకంఠీ! సౌజన్యయుతలైన మీకుఁ బరతంత్రుండనైన నాకు గ్రహింపనుగాని, గ్రహింపకుండనుగాని స్వాతంత్ర్యం బెక్కడిది? కావున సర్వవ్యాపారంబులయందు యథేష్టంబుగ నియోగింపనగు. కాదంబరి గుణంబు లెవ్వని దాసునిగాఁ జేయవు? అని సాదరంబుగఁ బలికి వారల ననిచెను.

చంద్రాపీడుం డట నా రేయి గడపి ప్రాతఃకాలంబున లేచి కాల్యకృత్యంబులఁ దీర్చికొని, కేయూరక! కాదంబరి

మేల్కాంచెనా? ఎచ్చట నున్నది? అనియడుగ నతం డరిగి కను
గొని వచ్చి, దేవ! మందరప్రాసాదంబు ముంగిటితిన్నెపయి
మహాశ్వేతతోఁగూడ నున్నది; అని నివేదింప గంధర్వరాజ
పుత్త్రి నవలోకింప నరిగెను. రాజపుత్త్రుండు సమీపించి యం
దున్న పీఠంబునఁ గూర్చుండి కొంతకాలంబుండి చెలువవ్యా
లయ మహాశ్వేత మొగంబు గాంచుటయు నాయను యాత
నిభావంబెఱిఁగి కాదంబరితో నిట్లనియె:—సఖి! చంద్ర
మయూఖంబులచేఁ జంద్రకాంతంబు పగిది నీగుణంబులచేఁ
జంద్రాపీడుం డార్ద్రహృదయుండై వచింపఁజాలకున్నవాఁడు.
కాని మగిడి పోఁదలంచియున్నాఁడు. వెనుక రాజచక్రం బీతని
వృత్తాంతంబు దెలియక దుఃఖించుచుండును. ఇది మొదలు
మీకుఁ గమలినీకమల బాంధవులకువలెను, కుముదినీకుముద
బాంధవులకువలెనుఁ బ్రీతి స్థిరంబుగనుండుత, మఱియుఁ
గాదంబరి "సఖి! మహాశ్వేతా! ఏను పరిజనంబుతోఁ జిత్తంబు
వలె రాకుమారునకు నధీనురాలను. ఇందనురోధం బేమి?" అని
పలికి గంధర్వకుమారులంబిలిచి యీరాజసుతుని నిజభూమిం
జేర్పుఁడని యాదేశించెను.

అంతఁ జంద్రాపీడుండు లేచి మహాశ్వేతకుఁ బ్రణమిల్లి
దేవి! బహుభాషి ని లోకంబు విశ్వసింపదు. పరిజనప్రస్తావం
బుల యందీజనుని స్మరింపవలయు, నని పలికి హేమకూటంబు
వెలువడి మహాశ్వేతాశ్రమంబునకు వచ్చి యింద్రాయుధంబు
నడుగులజాడ నేతెంచి యచ్ఛోదసరస్తీరంబున నున్న తన
సైన్యంబుం గాంచి గంధర్వకుమారుల ననిచి సూనందంబునను

విస్మయంబునను నందలిజనులు ప్రణమిల్లుచుండ నిజశిబిరంబున కరిగెను. అందు రాజలోకంబునకు దర్శనంబొసంగి వైశంపాయనునితోడను, పత్రలేఖతోడను మహాశ్వేత యిట్టిది, కాదంబరి యిట్టిది, మదలేఖ యిట్టిదనియెన్నుచుఁ బవలు గడపెను. కాదంబరీ రూపదర్శనంబున ననూయఁగొనెననఁ దొల్లింటివలె రాజ్యలక్ష్మి యాతనికిఁ బ్రీతినొసంగదాయెను. కాదంబరిం జింతించుచు మేల్కాంచి యుండఁగనె రేయియుంగడచెను.

---

## షోడశ ప్రకరణము.

### —— కాదంబరీ పునర్దర్శనము. ——

---

మఱునాఁడు చంద్రాపీడుండు పేరోలగంబుండ నేతెంచి ప్రణమిల్లిన కేయూరకునింగని ‘రమ్మ, రమ్మ’ని చేరంబిలిచి, ‘కేయూరక! సఖీజనంబులతోఁ గాదంబరియు మహాశ్వేతయుఁ గుశలంబున్నవారె?’, అనియడుగ నతండిట్లనియె—దేవరవారాయమను నిట్లడుగుట నిప్పుడకోమలి కుశలినియని పలికి తమ్మితూఁటిదారంబునఁ గట్టఁబడిన కమలదళసంపుటంబు విచ్చి యందలి పాలపోకలను, తమలపాకులను, కపురంబును, మంచి గందంబును గనఁబఱచి ‘ఇయ్యవి కాదంబరి యనిచిన యడిమాలము’ లని విన్నవించి ‘ఇయ్యది దేవరవారు శయనీయంబున మఱచిన శేషహారము;’ అని కొంగుముడి విచ్చి యద్దానిం జామర గ్రాహిణికరంబున నర్పించెను.

అంతఁ జంద్రాపీడుండు సర్వంబును దాన గ్రహించి యవ్విలేపనంబు మేననలఁదుకొని యాహారంబు కంఠంబునం దాల్చి రాజలోకంబునకు ననుజ్ఞయొసఁగి కేయూరకునితో నశ్వశాలకుఁజని యచట నేకాంతంబున నిట్లడిగెను. ‘కేయూరక! నావచ్చినది మొదలు గంధర్వ రాజకులంబు వృత్తాంత మేమి? సర్వంబు చెప్పుము’ నావిని కేయూరకుం డిట్లనియె:- ‘దేవ! చిత్తగింపుము. నీవందుండి వెడలుడు కాదంబరీదేవి సౌధశిఖరంబు నెక్కి నీవచ్చిన తెఱువు నీవు కనఁబడునందాఁక గాంచి యవ్వల దేవరవారు వసించియుండిన క్రీడాపర్వతంబునకు వచ్చి అచ్చట రాజనందనుం డీమరకత శిలాతలంబునఁ గూర్చుండెను. ఈస్ఫాటిక శిలాతలంబున భుజించెను. ఈముక్తా శిలాపట్టంబునం బన్నుండెను; అని పరిజనంబులు నివేదింప దేవరవారి వాసచిహ్నంబులె గాంచుచుఁ బవలు గడపెను. దివసావసానంబున మహాశ్వేతయత్నంబుననె యాహారంబు గ్రహించెను. అంతఁ జంద్రుం డుదయింపఁ జెక్కిటఁ జేయిడికొని యేమియొ చింతించుచు క్షణమాత్రంబుండి శయ్యాగృహంబునకుం జని శయనంబునం దనువల్లిఁ జేర్చి యది మొదలు ప్రబలంబైన దాహజ్వరంబుచే నతిదుఃఖంబున రేయి గడపి ప్రభాతంబుననె నన్నుఁ బిలిచి దేవరవారి కీవార్త నెఱింగింప నానతిచ్చెను.’ అనుటయుఁ జంద్రాపీడుండు ‘అశ్వం బశ్వం,బని పలవరించుచు శిబిరంబు వెడలెను. తరువాత పరిజనులు గొని వచ్చిన నింద్రాయుధంబు నెక్కి పత్రలేఖ నెక్కించుకొని వైశంపాయనుని స్కంధావారంబున నునిచి కేయూరనికుతో హేమ

కూటంబున కరిగెను. అట్లు కాదంబరి భవనద్వారంబు సేరి యశ్వంబు దిగి పత్రలేఖతో లోనం బ్రవేశించి యం దొక్కనిం గాంచి కాదంబరి యెచ్చట నున్నదని యడుగ నతండు 'దేవ! క్రీడా శైలంబు దిగువ నిర్మితంబైన హిమగృహంబున నున్న దని నివేదింపఁ గేయూరకుండు దారి సూపుచుండఁ జని హిమ గృహంబు ప్రవేశించి బిసతంతుమయంబులైన చామరంబులను, కువలయాదిమయంబులైన ఛత్రంబులనుం గ్రహించి జలదేవతల సమూహంబో యనఁ దనరి శిశిరోపచారచతురంబైన కాదం బరి పరిజనంబుం గాంచెను.

మఱియు నందు ఒక్కచో జలార్ద్రంబులైన పట్టుమేలుకట్ల క్రిందఁ బఱచియుండు తమ్మిసెజ్జలును, వేరొక్కచోఁ బూదం డల తూఁగుటుయ్యెలలును, ఇంకొక్కచో బిసతంతుమయంబు లైన వసనంబులును గాంచుచు వరుణుని క్రీడాగృహంబో, చంద్రకలల జన్మభూమియో, యన భాసిల్లు హిమగృహమధ్య భాగంబు ప్రవేశించెను. అందు నతిశీతలంబైన స్పర్శంబున కలరి తనమనంబు చంద్రమయంబో, ఇంద్రియంబులు కుముద మయంబులో, పవనంబు కర్పూరమయంబో, అని మనంబున భావించుచు నచ్చట తామరతూఁటి మండపంబున నున్న కాదంబరిం గాంచెను.

అత్తఱి నత్తలోదరి చెంతనున్న యన్నువలు 'చంద్రా పీడుండు వచ్చె' నని తెల్పఁ దిగ్గన తలయెత్తి కన్నులు దెఱచి, నిజంబుగ వచ్చెనే? నీవు కన్గొంటివా? ఎంతదవ్వున నుండెను. అని యడుగుచు రాజనందనుని దూరంబుననె కాంచి కుసుమ

శయనంబుననుండి లేచెను. అప్పుడు ప్రతీహారిగొనివచ్చిన పీఠం బుపయిఁ జంద్రాపీడుండు కూర్చుండఁ గుసుమశయనంబునం గాదంబరి కూర్చుండెను. అంత కేయూరకుండు ‹ఇయ్యది చంద్రాపీడదేవుని యనుగ్రహపాత్రురాలైన పత్రలేఖయను నడపకత్తె, యని పత్రలేఖం గనఁబఱచెను. కాదంబరియు న క్కన్నియం గాంచి ‹ఏమి? తమ్మిచూలికి మానవులయందుఁ బక్షపాతము, అని తలంచెను. పత్రలేఖ ప్రణమిల్లిన ‹రమ్ము రమ్మని తనసమీపంబునఁ గూర్చుండఁబెట్టుకొని కరకిసలయం బునఁ దాఁకెను. చంద్రాపీడుండును నట్టియవస్థలోనున్న కాదం బరి నవలోకించి యిట్లుచింతించెను. ‹నాహృదయంబెంత యకు శలంబు? ఇప్పటికిని విశ్వసింపదు, అనిచింతించుచుండ మదలేఖ యిట్లనియె:—‹కుమార! ఏమిచెప్పుదు? ఇక్కోమలికి సంతా పంబు నొసంగని దేమికలదు? చల్లని చివురులును జిచ్చు నను కరించెడిని. వెన్నెలయు నెండయయ్యెడిని. ఇందాకఁ బ్రాణ ధారణంబునకు ధీరతయు నిమిత్తంబగు, నని వచింప చంద్రా పీడుండు మహాశ్వేతతోఁ జతురాలాపంబులు సల్పుచు గొంతఁ దడవుండి యెట్టకేలకు విడిపించుకొని వెడలుడు, కేయూరకుండు వచ్చి ‹దేవ! కాదంబరీదేవి యిటఁబత్రలేఖం గొన్నిదినంబు లునుచుటకు వేఁడెడిని. తరువాత రాఁగలదు, నావిని చంద్రా పీడుండు ‹కేయూరక! దుర్లభంబైన దేవీప్రసాదంబునకుఁ బాత్రురాలగుటంజేసి పత్రలేఖ ధన్యురాలు. ఉండుత, మని పలికి శిబిరంబున కరిగెను.

అటఁ బ్రవేశింపఁగనె తండ్రియొద్దనుండి వచ్చిన లేఖ హారకు నవలోకించి దూరంబున నుండియె ‘ఓయి! సర్వపరిజనం బులతో మాతండ్రియు, మాతల్లియుఁ గుశలం బున్నవారె!’ అనిన, వాఁడు ప్రణమిల్లి ‘దేవ! అందఱు గుశలులు;’ యనివిన్న వించి లేఖాద్వితయంబు సర్పించెను. యువరాజు శిరంబున నిడి కొని తాన విచ్చి క్రమంబుగఁ జదివెను.

‘స్వస్తి శ్రీమత్సకల నరపాల వందిత పదకమలుండును, పరమ మాహేశ్వరుండునగు తారాపీడుండు సకలసంపదల కావాసుండైన చంద్రాపీడుని శిరంబున మూర్కొని యానం దించుచున్నాఁడు. ప్రజలు గుశలంబున నున్నవారు. ఇఁకేమన, నిన్నుఁగాంచి చాలకాలంబాయెను. కానమాడెందంబు నిన్నుఁ జూడ నుత్సుకంబై యున్నది. దేవియుఁ గృశించియున్నది. కాన నీలేఖం జదివిన తోడ్తోన వెడలి రావలయును. శుకనా సుం డనిచిన రెండవపత్రికయందును నీయర్థంబె యుండెను. తండ్రియానతిఁ జొప్పునఁ జనువాఁడనని పలికి ప్రయాణపటహం బు మ్రోయింపం జేసి మేఘనాదుని గాంచి యిట్లనియె—

‘కేయూరకుం డిటకుఁ బత్రలేఖం దోడ్కొని రాఁగలఁడు. నీవాపత్రిలేఖను వెంటబెట్టుకొని రమ్ము. కేయూరకుని ముఖం బునఁ గాదంబరి కిట్లు విన్నపం బనుపుము. ‘మానవుల ప్రకృతి కృతఘ్నంబుగాన నిందనీయంబు. ఇట్టు లుజ్జయినీపురాభిము ఖుండనైన యేను స్నేహంబును దాహంబు గావించితి. ధూర్త త్వముం బ్రకటించితి. ఏమి సేయుదు? గురునాన మీఱరానిది, ఇప్పుడుజ్జయినికిం బోయివచ్చెద. చంద్రాపీడుండు బ్రతికియుండఁ

నెడ దేవిని తిరుగ దర్శింపకుండఁడు; అని చెప్పి పుత్తెంచి మహా శ్వేతకుఁ బ్రణమిల్లుము., అని యానతిచ్చి మిత్త్రులంగాంచి సైన్యంబుం గ్లేశపెట్టక మెల్లమెల్ల నేతెంచునది., అని పలికి వైశంపాయనుని స్కంధావారంబున నియోగించి యిందాప్రా యుధంబు నధిష్ఠించి కొంత యశ్వసైన్యంబుతో వెడలెను.

## సప్తదశ ప్రకరణము.

### నిజపుర గమనము.

ఆనరపతి తనయుం డట్లువెడలి ఘోరారణ్యంబునఁ బవలెల్ల నడచి సాయంకాలమునకు నొక చండికాయతనంబుఁ జేరెను. అట నొకరక్తచందన వృక్షంబుమీద నెత్తఁబడియున్న గొప్పరక్తధ్వజము గలదు. అద్దానికిఁ గ్రొన్నెత్తురువోల నెఱ్ఱనగు లత్తుకరసంబునఁ దడుపంబడి తడినాలుకలంబోలు రక్త పతాకలు గట్టఁబడి యుండెను. ఆగుడియావరణంబున నొక్కచో నెఱుకులచే నఱుకఁబడిన యెనుబోతుల కన్నులంబోలు చెంగలువలును, వేఱొక్కచో సింగపుగోళ్లంబోలు నవిసె పూమొగ్గలును, మఱియొక్కచోఁ బులిగోళ్లంబోలు మోదుగమొగ్గలును జల్లఁబడి యుండెను. మఱియు, దుప్పికొమ్ములచే నంకురించినదివలెను, తడినాలుక తునుకలచేఁ జిగిర్చినదివలెను, ఎఱ్ఱనికన్నులచేఁ బూసినదివలెను, తలకాయ

లచేఁ బండినదివలెను నున్న బలిహింసను జూపుచున్నదియు, మిక్కుటమగు నెత్తురువరదలచేఁ బురుదగొనిన గుడిముంగిలి గలదియు, శరణుజొచ్చిన సర్వపశుజీవితంబుల చేతంబలె నెఱ్ఱఁ బట్టలచే నలంకరింపఁబడినదియు, కత్తులు నీటెలు మున్నగాఁజీవ విశసనశస్త్రంబులఁ దాల్చినదియు, బోయతలు దిద్దిన చెంది రంపుఁబొట్టుతోనొప్పి బొమముడిదాల్చిన మొగంబుగలదియు, తన్నొఅయుచున్న నడవిదున్నను వ్రేళులచేఁ బెదరించుచున్న దోయునఁ గదలుచున్న గర్భగృహదీపికలతో నొప్పునదియు, నగు చండికం గాంచెను. అచ్చట దీక్షదాల్చినవిపోలె గడ్డము లువెంచుకొనియున్న మేకపోతులును, జపించుచువిపోలెఁ బెదవుల నాడించు నెలుకలును, ప్రాణాచారము పడినవిపోలెఁ బండుకొని యున్న లేళ్లును, గండదీపములు దాల్చినవిపోలె దలమానిక ములుగల సర్పములును నొప్పుచుండెను.

అందు ముదుకండగునొక ద్రావిడుండుకలఁడు. వాఁడు తనకు నేండ్లు నిండినను దక్షిణ రాజ్యాధికారము నొసఁగుమని చండి కనుబాధించుచుండెను. మఱియు, వానికి నిధులు త్రవ్వవలయు ననియు, బంగరు సేయవలయుననియు, యక్షిణులంగవయవల యుననియు, తిరోధానమంత్రములు సాధింప వలయుననియుఁ బెక్కు వెఱ్ఱులు గలవు. వాఁడు తెల్లావాలను మంత్రించి చల్లి నంతన గ్రహములు పట్టినవార లుఱుకుచుఁ జప్పట్లు చఱచు చు నఱచుచుందురు. అతం డానబుబుఱ్ఱవీణం బట్టుకొని వా యించుచుండ బాటసారులు వినఁజాలక దూరమున నేగుచుం దురు. వాఁడు పవల్లెల్లను దలయూడించుచు గోవుల గీతంబుం

బలె గానంబు సేయుచుండును. అఱవపాటలఁ బాడుచు నాడు చుండును. మఱియు నాతండు ఘోటకబ్రహ్మచర్యంబు దాల్చి యుంటంజేసి యటకుఁ బలుదేశములనుండివచ్చిన ముదియోగి నులమీఁదం బెక్కుమాఱులు స్త్రీ వశీకరణ చూర్ణంబు జల్లు చుండును. బాలురువచ్చి తిట్టి పోవుచుండ వారి వెనుదవిలి యుఱుకుచు నేలం బడుచుండుటచే వాని యొడలెల్లఁ గాయలు గాసి యుండెను. పొట్టివాఁడుగాన మెల్లగాఁ దిరుగువాఁడును, చెవిటివాఁడుగాన గుర్తులతో వ్యవహరించువాఁడును, రేఁజీకటి గలుగుటంజేసి పవలు మాత్రము సంచరించువాఁడును, పెను బొజ్జ గలుగుటంజేసి యత్యాశనంబు గుడుచువాఁడును, చెట్ల నుండి పండ్లు వ్రాలఁగొట్టుచుండఁ బెక్కుమాఱులు గోపించిన కోతుల గోళ్లచేఁ జీల్పఁబడిన ముకుదొప్పలు గలవాఁడును, పలు మార్లు పూవులువ్రాలగొట్టుచుంటంజేసి తుమ్మెదలచేఁ జిల్లులు వొడువఁబడిన యొడలుగలవాఁడును, వసంత క్రీడకై వచ్చెడు కోడెకాండ్రచేఁ గుక్కిమంచముమీఁదఁ గూర్చుండఁబెట్టి వృద్ధ దాసీ వివాహపరిహాసంబులు సల్పంబడుచుండువాఁడును నగు.

రాజనందనుం డాచండికాయతనంబు చేరువనె విడిది గావించెను. గుఱ్ఱంబు దిగి చండికాదేవికిఁ బ్రణమిల్లి యందగు విశేషంబు లఱయుచు నందొక్కచోఁ గోపించియఱచుచున్న ద్రవిడునింగాంచి నవ్వెను. వానితోఁ గలహించుఁ దన సైని కులను వారించెను. ఆరాత్రి యటవసించి మఱునాఁడుదయం బున నచ్చటిద్రావిడునకు నధికధనంబొసఁగి యందుండి వెడలి కొలఁదిదినంబులలో నుజ్జయిని ప్రవేశించెను.

చంద్రాపీడుండు తండ్రింగని ప్రణమిల్లి తదనుమతిం దల్లిని దర్శించి మ్రొక్కి యటనుండి కదలి శుకనాసమనోరమ లం గాంచి వైశంపాయనుండు స్కంధావారంబున సుఖం బున్నాఁడని తెలిపి కుమారభవనంబుచేరి యాహారాదులు నిర్వర్తించి కాదంబరిం దలంచుకొని యాభామిని లేఖుకిఁ దనభవనంబు నవంతీదేశంబునుగూడ శూన్యంబుగానెంచుచుఁగాదంబరీ వార్తాశ్రవణంబు నిరీక్షించుచుండఁ గొన్నాళ్లకు మేఘనాదుండు పత్రలేఖం దోడ్కొనివచ్చెను. పత్రలేఖ దూరంబున నెయుండి నమస్కరింప రాజలోకంబునకు సెలవొసంగి దానిం దోడ్కొని మందిరాభ్యంతరమునకుం జని, పత్రలేఖా! ఏను వచ్చినపదంపడి యచ్చటివృత్తాంతము దెల్పుమనిన నది యిట్లని విన్నవించెను.



## అష్టాదశ ప్రకరణము.

### కాదంబరీ సందేశము.



దేవ! ఆలింపుము. అటనుండి దేవరవారు వెడలుడు నేను కాదంబరిదగు శయనీయసమీపంబున సుఖంబుగఁ గూర్చుంటిని. అంత నపరాహ్ణంబున నన్నుపట్టుకొని యటనుండి వెడలి పరిజనుల వారించి లేఁదోటకుంజని యటఁ బటికంబుటనుగుపయిఁ గూర్చుండి మానికపు గంబంబున కొఱఁగి మొ

కింతసేపు మనంబున నాలోచించి యేమియో చెప్పనెంచి కను
తెప్పవేయక నా మొగంబునసె చూడ్కి నిల్పి యవలోకించు
చుండెను. అంతనే సక్కాంత భావంబెఱింగి యాయమ
మొగంబునన చూడ్కి నిల్పి 'ఆనతి'మ్మని విన్నవింప, వన దేవత
లాలింతురో' అని శంకించినదానివలె బలుమాఱు నిటునటు
జూచి చెప్ప నిచ్ఛగల్గియు లజ్జచేఁ జెప్పఁజాలక కన్నీరు గార్చు
చుండెను. అత్తఱి మాయిరువురకు నిట్లు సంభాషణము జరిగెను.

పత్రలేఖ—దేవి! సందియమేమి? నీభావమునాకుఁ దెలుపుము.

కాదంబరి—సఖి! నాపరిభవం బెవ్వనితోఁ జెప్పుదు ? నాదుః
ఖంబు నీ కిప్పుడు విన్నవించి ప్రాణంబులు విడిచెదను.

పత్ర—దేవి! నీకుగల దుఃఖ కారణంబేమి ?

కాదం—నావలె నెవ్వతె కులంబునకుఁ గలంక మాపా
దించును? తండ్రి సంకల్పించెనా ? తల్లి యనుమోదిం
చెనా? ఏమైన వార్త నంపితినా? నీచురాలిపగిది చం
ద్రాపీడుని వలన నిట్టివట్టిదూఱుఁ గట్టుకొంటినిగదా ?
నాకు నీకంటె ప్రాణప్రియ లేదుగాన క్రమ్మఱను నీతో
జన్మాంతరసంగమంబు గోరెద. ఇప్పుడు ప్రాణపరి
త్యాగ రూపంబైన ప్రాయశ్చిత్తం బొనరించి నాకసటు
గడిగి కొనియెదను.

పత్రి—దేవి! కుసుమ కోమలంబైన నీడెందంబునకు నొప్పి
గలుగ యువరాజేమి తప్పొనరించెనో? ఆనతిమ్ము.
విని యేను మున్ను సురుల విడిచెద. పదంపడి నీవట్లొన
రింతువు గాక.

కాదం—చెప్పెద నవధానంబున వినుము. రాకొమరుండు ప్రతి దినంబును గలలోనవచ్చి చిలుకలతో-గొరువంకలతోఁ గుట్టుమాటలం జెప్పి పుత్తెంచును.

పత్ర—దేవి ? ఇటులేనిఁ గోపంబు విడువుము. నీవచించిన వన్నియుఁ బంచబాణుని తప్పులుగాని యువరాజునవి గానేరవు.

కాదం—ఏపట్టివార్తల నెఱుంగ, ఉవ్రునామనంబునకుం బవలి దానవు గాకుంటం జేసి నిన్నె యడిగెద. ఇప్పటికిఁ దగు కర్జంబు నీవ యుపదేశింపుము. నాడెందంబు గురుజన నింద కోర్చి జీవించుటకంటెఁ ద్రెళ్ళుటయ శ్రేయమని యెంచెడిని.

పత్ర—దేవి! నిష్కారణ మరణోద్యమంబు వలదు. ఇందు గురుజననింద యేమికలదు? తామంతన పతుల వరించిన కన్యకల నెందఱఁ జెప్పుదు? నీయడుగుదమ్ముల యాన, సెలవొసంగుము. ఏనువెడలి నీప్రియతమునిం గొని వచ్చెద.

కాదం—సఖీ! నీకు నాయందుగల ప్రేమాతిశయంబు నెఱుంగుదు. తామంతన సందేశంబు నంపువారు సాహసకారిణులు గదా? ఐనను ఏమిసందేశింప వలయు?

పత్ర—నీయందెక్కువ యనురాగంబు గలిగి యున్నదానవని సందేశ మంపుము.

కాదం—అది వేశ్యాలాపము కాదా?

పత్రి—అవశ్యము రావలయునని కబు రంపుము.

కాదం—అది సౌభాగ్యగర్వము కాదా?
పత్రి—ఏను వచ్చుచున్నదాన నని తెలుపుము.
కాదం—ఇది స్త్రీచాపలము కానేఱదా? ఇది యుండనిమ్ము.
నీవు దుఃఖితవై యుండ నేను పాణిగ్రహణంబు చేసికొన
నని మహాశ్వేతతోఁ బ్రతిన సేసి యుంటినిగదా?
పత్రి—దేవీ! అమ్మాట మనసున నుంపకుము. ప్రియునిఁ
జూడకున్నచో, పాపకారియగు మదనుండు ప్రాణం
బుల నపహరించునుఁ జుమా?
కాదం—ఆచెనఁటి మరుఁడెట్లును నన్ను జంపకున్నాఁడు గదా?
పత్రి—దేవీ! అనుగ్రహింపుము. సంతాప మొందకుము.
ఏనరిగి చంద్రాపీడుం గొనివచ్చితినని విశ్వసింపుము.
కాదం—నిన్నుగాంచుచు మేన నుసురులు దాల్చియున్న
దాన, ఐనను, శక్యంబగుచో కార్యంబు సాధింపుము.
అని పలికి తాంబూలము నొసఁగి నన్నుఁబనిచెను.

దేవా! అట్టి యవస్థయందున్న దేవిని దూరీకరించుట యా
పన్నవత్సలంబగు దేవరవారిప్రకృతికిం దగునా; అని సోపా
లంభంబుగ విన్నవింప నా యాలాపంబు విని చంద్రాపీడుండు
ధీరప్రకృతియయ్యు మిగులఁ బర్యాకులుండై యిట్లనియె:—
"పత్రలేఖా! ఏమి చెప్పుదు? మనోభవుండు ప్రేరేప నబ్బాల
లోని వికారంబుల నాకెఱిఁగింప యత్నించుచో నది యంత
యుఁగాంచి, దివ్యకన్యకల నంతకుమున్ను గాంచియుండమి
నట్టిలీలలు సాజంబులని యెంచుటంజేసి యిట్టిదగు దేవి దుఃఖం
బు[illegible]నకును గారణంబనైతి. నాకును

మనోవ్యామోహకరంబగు నేదియో శాపంబు గలదని తలం
చెద. అట్లుగాదేని పరిస్ఫుటంబులగు మదనచిహ్నంబులు గా
నంబడుచుండ నాతునం బెట్లు వ్యామోహంబు నొందును' అని
పలుకుచుండఁ బ్రతీహారివచ్చి 'దేవ! ఎవ్వండో వాకిట నిలిచి
'కేయూరకుండను. యువరాజదర్శనంబు గోరెద'నని నుడువు
చున్నాఁడని విన్నవింప నమ్మాటవినఁగనె త్వరితంబుగ లోనఁ
బ్రవేశపెట్టుమని పల్కి వానింగాంచి 'రమ్మురమ్మని కర
మ్మునఁజేరందివిచి యిట్లనియె:—"కేయూరక! నీదర్శనమ్ము
చేతనె కాదంబరి కుశలమున నున్నదని తెలిసెడిని. మహా
శ్వేతాకాదంబరులసందేశం బెఱిఁగింపుము" అని యడుగ
నతండిట్లనియె:—'దేవ! ఏమని విన్నవింతు? నేను వారిసందే
శంబులం గొనివచ్చినవాఁడ గాను. పత్రలేఖను మేఘనాదు
నొద్ద విడిచి మరలి హేమకూటంబుసేరి దేవరవా రుజ్జయిని
కరిగిన వృత్తాంతంబెఱిఁగింప, వేడినిట్టూర్పులు విడుచుచు 'ఇది
యిట్లయ్యెనా' యని మహాశ్వేత తనయాశ్రమంబునకుం
జనియెను. కాదంబరీదేవియు నవ్వార్తచే శిరంబునఁ బిడుగు
వడిన వడువున కొంతదడవునకు దెప్పిఱిలెను.

దేవా! ఆకన్నియ తనువునగల మదనానలంబు వైద్యు
తానలంబునుం బోలె జలయంత్రధారలచేఁ దడిసిన కొలఁది
నుండును. శిశిరోపచారంబుసేసినకొలఁది చెమ్మటం గలి
గించును. అగ్గిచే నిర్మలంబు సేయంబడు వసనంబునుం బోలె
మదనాగ్నిచే లావణ్యంబు బెఱుగుటకదు చిత్రము, అన్నివిధముల
నద్దేవికి మదన వేదనచే నంగంబులును, వలయరచనచేఁ దవిస్మ

తూండ్లును, ఉపదేశంబులచే సఖీవచనంబులును, శయ్యాపరి కల్పనంబుచే నుద్యాన కుసుమంబులును, నిశ్శేషంబుగ క్షీణం బులయ్యెను. పలుమాటలేల? సఖీజనులందఱు నీపేరుచ్చరించు వారె? అందఱును గుంపులుగూడి నీయాగమనోపాయంబు నాలోచించువారె. చిత్రవిద్యాభ్యాసంబు భవదాకారమ యంబె, అని తెలుపు కేయూరకుం గాంచి ‹ఉండనిమ్ము. ఇప్పుడే వినంజాల, నని చంద్రాపీడుండు గనుంగవ మూయ మూర్ఛ యాతని నాక్రమించెంగాని యవస్థానివేదనంబు పరిస మాప్తి నొందదాయెను. రాజనందనుండు కొంతదడవునకుఁ దెప్పిఱిలి కేయూరకుంగాంచి ‹గంధర్వకుమార! కొలఁది దిన ములలో నేను రాఁగలనని దేవి నాశ్వాసింపఁజేయుము. నీతో పత్రలేఖ రాఁగలదు. అని పల్కి, పత్రలేఖా! నీవరుగునప్పుడు శరీర సంస్కారంబునెడ ననాదరంబు సేయవలదు. ఎఱుఁగని దారింబోవలదు. నాజీవితంబు నీహస్తంబున నున్నది. అని చెప్పి, కేయూరకుంగాంచి దేవికి మదాగమనంబు దెల్పి నన్ను దోడ్కొని పోవుటకై క్రమ్మఱ నీవు మహాశ్వేతాశ్రమం బున కరుదెమ్ము, అని చెప్పి యనిచెను.

---

## ఏకోనవింశ ప్రకరణము.

### రాజ్య ప్రయాణచింత. ప్లో౦

తరువాత చంద్రాపీడుండు తన మనంబున నిట్లు వితర్కించెను. ఏమిసేయుదు? ఏను తలిదండ్రులకుఁ జెప్పక, వారి

యాశీర్వాదముం గొనక యుచ్ఛృంఖలంబుగ నరుగుదునేని శ్రేయం బెట్లుగల్గు? చనినతరువాతచింత యటుండుగాక! మొదట పోవుటయెట్లు! నాజనకుండు రాజ్యభారంబు నాయం దునిచెను. ఇప్పుడేను చెప్పక యడుగుదాటుదునేని రాజులంద ఱును సకల సైన్యంబులతో నను వెదక నలుగడలకు నవశ్యం బును బఱువకుందురే? మఱియు, నేను వోవునెడ (పోనిమ్ము పోయిననే'మని నాతండ్రి నాయవినయంబునకుఁ గోపించి నా యందలి స్నేహం బన్యునియందుఁ బెట్టుకొని యుండనైన నాతండ్రికి నొరుండెవ్వఁడు కలఁడు? దానంజేసి నాతండ్రి నా వెంటనే తేరఁ బుడమియెల్ల నేతేకుననియెతో చెడి? అప్పుడు నేనెటకుఁ బోవలయు? ఎచ్చోట దాగికొనవలయు? పట్టువడి తండ్రి మోమెట్లు చూడవలయు? అడిగిన నుత్తరమేమి చెప్ప వలయు? మఱి దైవయోగంబునఁ జిక్కకపోదునేని నప్పుడును దలితండ్రుల దుఃఖసాగరంబున ముంతును గదా? ఇంక నాజ ననీజనకులకుఁ దెలిపి వారి యనుజ్ఞఁగొని పోవుదునేని నేమని చెప్పుదు? గంధర్వ రాజనందన నాయం దనురాగము చెంది యాయాస మొందుచున్నదని చెప్పుదునా? దానియందు నాకు గొప్పయనురాగము గలదుగాన నద్దాని విడిచి యేను జీవింపనని వచింతునా? అట్లుగాక, మాకిద్దరకును వివాహము సేయ మహాశ్వేత వార్త యనిచెనని వక్కాణింతునా? ఎట్లును దలిదండ్రులకుఁ దెలిపి వారి యనుజ్ఞమెయి వెలువడ శక్యంబు గాదు. ఏలన, దిగ్విజయయాత్రకు వెడలి యిప్పుడు మూఁడు సంవత్సరముల కేతెంచితి. నేఁటికి సైన్యంబు సేరదాయె. గమన

కారణంబు సెప్పక తండ్రివద్ద నెట్లు సెలవుగొననగు? సుహృత్సాధ్యంబగు నిక్కార్యంబున నొక్కండ నేమి సేయుదు? వైశంపాయనుండు సమీపంబున లేఁడయ్యె. మఱి యెవ్వండు నాతండ్రికి నాతల్లికిని బోధించి నన్ను గొనిపోవ సమర్థుండు కలఁడు? అని చింతించుచుండ నారాత్రి గడచెను. ప్రాతఃకాలముననె స్కంధావారంబు దశపురి కరుదెంచెనని విని చిత్తంబున నూఱటగొని యిట్లుదలంచెను. 'చిత్రము! ధన్యుండనైతి. ఏను చింతింపగనె నారెండవ డెందంబైన వైశంపాయనుండు వచ్చెడువార్త తెలిసె'నని హర్షపరవశుం డయ్యెను.

---

## వింశ ప్రకరణము.

### వైశంపాయన వృత్తాంతము.

---

మహారాజకుమారుండు శుకనాసముఖంబున తాను వైశంపాయను నెదుర్కొనఁ దండ్రి యనుజ్ఞవడసి యింద్రాయుధంబు నెక్కి తురంగ సహస్రంబులతో నగరంబు వెలువడి దశపురీమార్గంబున నరుగుచు వేగునంతకు మూఁడు యోజనంబులు గడచి సూర్యోదయంబైన పదంపడి స్కంధావారంబు డగ్గఱి తన మనంబున నిట్లు తలంచెను. 'ఇప్పు డేరికిం దెలియక ట్లే నరిగి నచ్చెలి కెచ్చుకు నచ్చెరువు గలిగింతు'నని

తలంచి యట సుజ్జ్రవు దళంబు నిలిపి మూఁడు నాల్గు వారు
సంబులతోఁ గదలి స్కంధావారంబు ప్రవేశించి 'వైశంపా
నుం డెందున్నవాఁడని యడుగుచు రా నందు గొందఱు 'భద్ర!
ఏమి యిట్లడిగెదు? ఇంకెట్లు వైశంపాయనుం డుండు'నని
పలుక అయ్యో! పాపులార! ఏమి యిట్లు పల్కెదరు, అని వా
రల నదలించి శూన్యహృదయుండై మఱి యెవ్వారి నడుగక,
ఒక్కచోనైన నిలువక 'ఎచ్చటికి వచ్చితిని?ఏమిచేయవలయు?
నని యేదియుఁ దోపక సేనయం దంతటఁ దిరుగుచుండెను' అది
గాంచి 'ఇంద్రాయుధంబు గుర్తునఁ జంద్రాపీడుండని నిశ్చ
యించి పఱచుచువచ్చి' లజ్జచేఁ బ్రణమిల్లు రాజసహస్రంబులఁ
గాంచి 'వైశంపాయనుం డెక్కడ? అని యడుగ వారందఱు
తమలో నాలోచించుకొని 'దేవ! ఈతరుతలంబునఁ గూర్చుం
డుము. పిదప వైశంపాయనుని వృత్తాంతము చెప్పఁగలము.'
అని విన్నవించిరి. కష్టతరంబైన యావచనంబుచే హృదయం
బు దల్లడిలుటఁ జంద్రాపీడుండు సొమ్మసిలెను.

అప్పు డారాజన్యులు రాజనందను నశ్వంబుననుండి
దించి కూర్చుండఁబెట్టి పట్టుకొని శైత్యోపచారంబులు సల్పు
చుండఁ గొంత దడవునకుఁ దెలివొంది వైశంపాయనుం గానక
తన్నుగాంచి 'ఏమియిది? ఎందున్నాఁడ'నని యేదియు నెఱుంగక
వైశంపాయనుండు లేక సైన్యంబుమాత్ర మేతెంచుటం జేసి
యప్రియంబు నూహించి 'విలపింతునా? ప్రాణంబులు విడుతు
నా?ఒంటిమెయి నేదేని దెస కరుగుదునా' అని యోజించుచుఁ
జిత్తంబున నిట్లు వితర్కించెను. ప్రజలు గలదయ్యు జగము

నాకు శూన్యంబయ్యె. ఇప్పుడు నాకు జీవితంబుతోనైన గాదం బరితోనైన నేమి? వైశంపాయనుని విడిచి నాతండ్రి మోమె ట్లు గనుగొందును? శుకనాసు నెట్లు చూడఁగలను?' అని చిం తించుచు నధోముఖుండై మెల్లన వారల నిట్లడిగెను:—ఏ వచ్చిన పదంపడి సడుమ నేదేని మహాసంగ్రామంబు ప్రాప్తం బయ్యెనా? అసాధ్యరూపంబగు మహావ్యాధి కలిగెనా? ఏల యిట్టి బెట్టిదంపు మహావజ్రపతనం బుపనతం బయ్యె? అనుట యుఁ జెవులు మూసికొని రాజు లిట్లని విన్నవించిరి.

'దేవ! దేవరవారివలె వైశంపాయనుండును శతాధిక వర్షంబులు జీవించెడిని, నావిని చంద్రాపీడుం డానందా శ్రువు లొలుక వారల నట్టె కౌగిలించుకొని 'వైశంపాయ నుండు జవించియుండు నెడ క్షణముసేపైన వేఱువో నుండనే రఁడని భావించి యిట్లడిగితి. అతండు రానికతంబేమి? ఎందు న్నవాఁడు? అతని నొంటిగ నెట్లు విడిచివచ్చితిరి? అని యడుగ వార లిట్లనిరి. "దేవ! జరిగిన వృత్తాంతము వినుము. సైన్యం బుతోఁ గలసి మెల్లమెల్లగా వెనుక నరుదెమ్మని వైశంపాయ నునితో దేవరవా రనుజ్ఞ యిచ్చి వెడలఁగా మఱునాఁడు ప్రయాణభేరి మ్రోయించి సైన్యంబు సన్నద్ధంబుసేయ ప్రాతః కాలంబుననె వైశంపాయనుం డిట్లనియె:—ఈయచ్ఛోదం బతిపుణ్యతీర్థం బని పురాణంబులయందు వినంబడుచుండును. కాన నిక్కొలనం గ్రుంకి దీని తీరంబున వెలయు సిద్ధాయతనం బున నున్న భగవంతుఁడగు మహేశ్వరునకుఁ బ్రణమిల్లి యరుగుదము.' అని పలికి పాదచారియై యచ్ఛోదసరస్తీ

రంబు' జేరెను. ఆప్రదేశం బతిరమ్యంబగుటం జేసి నలుదెసలుఁ గాంచుచు నొక లతామండపము విలోకించెను. దానింజూచి చిరకాలమునుండి చూడని మిత్రుసింబలె తెప్పఁ వేయక యట్టె గాంచుచు నచ్చటం గూర్చుండి కనుఁగొలంకుల నిరంతరాశ్రు ధారలం గార్చుచు లోననేదియో ధ్యానించువానివలె నధో ముఖుండై యుండెను. అంత నే మతనిం గాంచి యతిమనోజ్ఞం బగు నిప్రదేశంబు జూడ నితనికి మనోవికారంబు గలిగె నని తలంచి, లెమ్ము. కాలం బతిక్రమించెను. సేనాసముదా యంబు మీరాక నిరీక్షించెడి, నని పలుక, నతండు మాయా లాపంబులు విననివానివలె నేమియు మాఱుపలుకఁడయ్యె. కేవలము నాలతామండపమునె కాంచుచుండెను. రమ్మని మేము పలుమఱు బోధింప నప్పు డాయనకు మాకును నిట్లు సంవాదంబు జరిగెను.

వైశంపాయనుఁడు—సైనికులారా! నే నీప్రదేశంబునుండి రాఁజాలను. మీరలు సైన్యంబుం దోడ్కొని పొండు. చంద్రాపీడుం డరుగఁగా క్షణమైన మీరిందు నుండఁ గూడదు.

సైనికులు—నీవుమిత్రుండవు, గుణవంతుఁడవు నని సర్వంబు నీయధీనంబు సేసి మహారాజుగారు పోయియుండ నిది యంతయు విడిచి మీ కిం దుండనగునా? ఈ శూన్యార ణ్యంబున మిమ్ము నొంటి మొయి విడిచిపెట్టి యెట్లు పోవలయు? పరమున మగుడు.

వైశంపా—గమనమునకై మీరు బోధింప నింతమాత్రమునే నెఱుంగనా? ఇంతకుమున్ను చంద్రాపీడుని విడిచి క్షణమైన వేఱుచో నుంటినా? సంకెలలు వేయఁబడినట్లు నాచరణంబు లింకొక్కయెడకు రాఁజాలవు. కాన నా యత్నంబున నేను రాఁజాలను. మీరలిచ్చోనుండి నన్ను బలాత్కారంబున గొని పోదురేని నీ ప్రదేశంబునుండి కదలు నెడ నా జీవితంబు నిలువదు. కాన నన్ను నిర్బంధింప వలదు.

సైనికులు—ఇట్లేల చెప్పెదరు? విచ్ఛేయుడు.

వైశం—రాఁజాలని కారణము నాకుఁ దెలియదు. మీర లరుగుడు.

అని చెప్పి యిన్నకుండెను. ఆతని వర్తనంబు గాంచుచు మూఁడు దినంబులుండి నిరాశులమై యందుఁ గొంతబలం బునిచి యేమరుదెంచితిమి, అని వచింపఁ జంద్రాపీడుం డిట్లని చింతించెను. ఇట్టి వైరాగ్యం బీతనికిఁ గలుగ నేమి కారణము? నాలోపంబు నెఱుంగ, తండ్రిగాని తల్లిగాని యప్రియంబు పల్కి యుండిరా? ప్రశాంతికైన నిది యదనుగాదు, అని చింతించుచు నారేయి సేనానికాయంబుతో వెడలి ప్రభాతంబునకు నుజ్జయినిఁ బ్రవేశించెను.

అందు గుంపులుగూడిన జనులచేత నడుగఁబడుచు, వర్ణింపఁబడుచు నున్న వైశంపాయనుని వృత్తాంతంబు వినుచు రాజకులంబు ప్రవేశించి మహారాజు విలాసవతితో శుక నాసునిపీటికరిగెనని విని శుకనాస భవనంబునకు నరిగి యందు

‘హా! వత్స! వైశంపాయన! బాలుండవె కదా? ఇట్టి నీవొంటి మెయి శూన్యారణ్యంబున నెట్లున్నాఁడవు? నీకు నటశరీర రక్ష యెవ్వం డొనరించు? నీవాకలిగొన్నను, దప్పి గొన్నను నెవ్వఁడు విచారించును? కుమార! నీకెందు రుచించెనో నీతండ్రికి విన్నవించి యటకు నన్నుం గొనిపొమ్ము. సుఖపెట్టఁదగిన తలిదండ్రుల నేల దుఃఖపెట్టెదవు? అని మనోరమ విలపించుచుండ నాలించుచు లోనఁ బ్రవేశించి తండ్రికేని మోము చూప లజ్జించుచుఁ బ్రణమిల్లి దూరంబుననె కూర్చుండెను. కూర్చుండిన చంద్రాపీడునింగాంచి తారాపీడుండు ‘వత్స! చంద్రాపీడ! నీకు వైశంపాయనునియెడ జీవితము కంటెను నెక్కుడు ప్రీతి గలదని యెన్నుచుంటి. ఇప్పుడు మిత్రునియెడ జన్మంబునకును స్నేహంబునకును ననుచితంబైన వృత్తాంతంబు విన నాడెందము నీదోషంబుగా శంకించెడిని. అని పలుకుచుండ నవ్వచనంబు నాక్షేపించి శుకనాసుండిట్లనియె:—

‘దేవ! మాతాపితృఘాతియు, కర్మచండాలుండునైన మహాపాతకికతంబున మీకంటెను గుణాధికుండగు చంద్రాపీడునియందు దేవరవా రిట్లు సంభావింపనగునా? దుస్స్వభావుం డగు వానిని చంద్రాపీడుండైన నేమిసేయునుః? శరీర సంభవంబులైన క్రిములును, మహావ్యాధులును నిట్లే తమ యంతన బుట్టుచుండును. ఈయజ్ఞానతిమిరాంధునకై యేమి చేయనగు? ఈతిర్యగంతువు శుకంబువోలెఁ జదివింపంబడియె. ఉభయలోక భ్రష్టుండగు నీదుర్జాతునకుఁ జేసిన సర్వంబును నేలపాలాయె. ఇట్టివాఁడు తిర్యగ్జాతియందు జన్మించి యు [illegible]

నను మేలగు. మేమిట్టి దుఃఖార్ణవమునఁ బడకుందుము గదా?
అని పెదవు లదర వెచ్చనూర్చుచుండెను.

అంత తారాపీడుండు శుకనాసుం జూచి యిట్లనియె:- మంత్రివర్యా! యౌవనారంభంబున బాల్యంబుతోఁగూడ స్నేహంబు జాఱి పోవును. ఇంద్రియంబుల జయించిన వారెవరు? ప్రథమ వయసున మాలిన్య మెట్లు విడుచును? సకల దుశ్చరిత చక్రవర్తియగు జవ్వనం బవతరింపఁ జాపల్యంబు సంభవింపకుండునే? మీరిట్లు లాలనీయుండైన శిశు జనునిమీద నలిగి నిందించెద రేల? తలిదండ్రులు బాలురకు దైవతంబు గదా? వారలకు గురుజనాశీర్వాదంబులు వరంబులగు నట్లాక్రోశంబులును శాపంబులయ్యెడిని, నిజంబెఱుంగక దూషింపఁ దగదు. తెలిసికొని రక్షింప యత్నింతము, అని నుడువుచుండఁ జంద్రాపీడుండు తనయందు జనకుండు దోషము శంకించుటం జేసి కశాభిఘాతంబు నొందినవానివలె కనుగవ నశ్రువు లొలుక శుకనాసునితో నిట్లనియె:— "ఆర్య! వైశంపాయనుండు రాకుండుట నాదోషంబునఁ గాదని బాగుగ నే నెఱుంగుదు. ఐనను, తమ రీదోషసంభావనకై నాకుఁ బ్రాయశ్చిత్తము నిరూపింపుడు. ఏను వైశంపాయనునిఁ గొనివచ్చుటకుఁ బోనెంచెద, అట్లుగాక నాకు దోషంబు వోనేరదు. వైశంపాయనుండు రానిచో మజ్జనకునకుం గలిగిన దోషసంభావనచే నేనును రాఁగూడదు. అన్యుండు వైశంపాయనునిం దోడ్కొని రాఁ జాలఁడు, అనవిని శుకనాసుండు మహారాజుం గాంచి "యువరాజు వైశంపాయనునకై యరుగ విన్నవించె

చెని. దేవరవారేమి సెలవొసంగెదరో' అన విని తారాపీడుం డిట్లనియె:—'ఆర్య! ఇతండె యతనిఁ దోడ్కొనిరాఁ జాలునుగాని యన్యుండు శక్తుండుగాఁడు. కాన నితం డరుగును గాక.' అని పలికి 'వత్స! నీవ లోని కరిగి మనోరమం గూడి యున్న నీతల్లికి నీగమనవృత్తాంతం బెఱిఁగింపుము.' అని వచించి నిజభవనంబునకుం జనియె.

అంత చంద్రాపీడుండు మనోరమం దర్శించి 'అమ్మ! ఊఱడిలుము. వైశంపాయనుం దోడ్కొనిరా నాకు జనకుం డాజ్ఞ యొసంగె. నన్ను విడువుము. అన విని మనోరమ యిట్లనియె:—'తండ్రీ! నీవు నే నరిగెదనని నన్నూఱడించెదవా? నీవైనం గ్రేవనుండిన వైశంపాయనుం డుండినట్లె భావించెద నీయొక్కనిచేతనే మేమిర్వురము పుత్రవతులమగుదుము. అనిష్టురాత్ముండు రాకున్నం బోనిమ్ము, నావిని విలాసవతి యిట్లనియె:- 'ప్రియసఖి! నీకు నాకును నీచెప్పినట్లయగు. కాని వైశంపాయనుండు లేకున్న నీతం డెవ్వనిఁ జూచి యూఱడిలును? వీని నేల వారించెదు? వారించినను నీతం డుండనేర్చునె? కాన నితని ప్రయాణంబు సేయుటకై యనుగుడముగమ్ము, అని పలికి యామెం దోడ్కొని యంతఃపురంబునకు నేగెను.

అనంతరము రాజసూనుండు గమనోద్యమంబునఁ దల్లింగాంచి ప్రణమిల్లుటయు విలాసవతి యిట్లనియె:—'తండ్రీ! ఇయ్యెడ నాకుగల మనోవేదన ప్రథమగమనంబునను గలుగదయ్యె. గుండియ పగులునట్లును, ప్రాణంబులు వెడలునట్లును తోఁచెడిని. కన్నీరు నిలిపినను నిలువదు. నావాక్కు వైశం

పాయనునిం దోడ్కొనిరాంబోవు నిన్ను వారింపంజాలదు. మనం బియ్యకొనదు. ఏమిసేయుదు? కాన నీవు తొల్లింటివలె కాలయాపనంబు సేయుకుము.' అని చెప్పి శిరంబు మూర్కొని యనిచెను.

అంత నతండు జనకునొద్దకుం జని నమస్కరింపం దారాపీడుం డిట్లనియె:—"కుమార! తండ్రిచే ననర్హాదోషంబున శంకింపం బడితినని మనంబున నుంపకుము. గుణగణంబులం బరీక్షించి రాజ్యభారం బారోపింపనగుగాని తనయ స్నేహంబు ననె యొసంగంజనదు. నీవీభారం బెవ్వనియం దునిచి దోషంబణువైన నాచరింతువు? నీవ సర్వ లోకానురంజనంబునకై యత్నింపవలయు. మాకుం గాలంబు గతించె. ఏను లోభంబుచేం బ్రజలం బీడింపనైతి. అవమానంబుచే గురువులం గోపింపంజేయనైతి. మదంబుచే సుజనుల విముఖులం గావింపనైతి. కామంబుచేం బరలోకంబు హింసింపనైతి. మఱియు, రాజధర్మంబు ననురోధించితిగాని స్వేచ్ఛనుగాదు. వృద్ధుల సేవించితి గాని వ్యసనంబులం గాదు. సజ్జనచరితంబు లనుసరించితిగాని యింద్రియంబులంగాదు. వృత్తంబు రక్షించితిగాని శరీరంబు గాదు. నిందకు భీతిల్లితినిగాని మరణంబునకుం గాను. జవ్వనంబున నఖిల సుఖంబు లనుభవించితి. నీజన్మంబుచేం గృతార్థుండనైతి. గాని దారపరిగ్రహంబు గాంచిన నీయందు సకల రాజ్యభారం బునిచి తొల్లిటి రాజర్షులు చనినమార్గం బనుసరింప వలయునని యెంచుచుండ దానికీ వైశంపాయన వృత్తాం

తంబు నిరోధకం బయ్యె. కాన నీవరిగినను జడవు సేయవల
దని పలికి తాంబూలంబు నొసఁగి యనిచెను.

---

## ఏకవింశ ప్రకరణము.

### చంద్రాపీడ మరణము.

---

చంద్రాపీడుండు కొందఱు రాజనందనులతో నిజ నగ
రంబు వెడలి తన మనంబున నిట్లు సంకల్పింపఁ దొడంగెను.
‘వైశంపాయనుండు నన్నుఁగాంచి సిగ్గునఁ బఱచనేని నతని
వెన్నంటి కౌఁగిలించుకొని సుహృత్సమాగమ సుఖం బనుభవిం
చెదను. అతనిం గూడి మహాశ్వేతం గాంచెదను. అట సైన్యం
బునిచి మహాశ్వేతతో హేమకూటంబున కరిగెదను. అచట
నన్నుఁగాంచి పూసెజ్జ పయినుండి లేచు కాదంబరిం జూచి
కనుగవఁ గృతార్థత నొందించెదను. మహాశ్వేత మాయిర్వు
రకుఁ బరిణయంబు యత్నింప నప్పని నిర్వర్తించెదను.’ అని
యాలోచించుచు నాఁకలిదప్పికలనైన లెక్కింపక రేలుంబవళ్లు
ప్రయాణంబు సేయుచు నచ్ఛోదంబుఁ జేరి యాశ్వికులతో
నిట్లనియె:—‘ఒకవేళ వైశంపాయనుండు మమ్ముఁగాంచి లజ్జ
చేఁ బఱచును. కాన మీరలు నాలుగు ప్రక్కల నవహితులరై
యుండ వలయు’నని వచించి తురగారూఢుండై లతాగహనం

బులను, తరుమూలంబులను, శిలాతలంబులను, గనుచు నంతటఁ బరిభ్రమించి యతని వృత్తాంతంబు మహాశ్వేతకు 'దెలిసి యుండునో' యని తదాశ్రమంబునకు నరుగనెంచి యట సైన్యంబు నిలిపి మహాశ్వేతాశ్రమంబునకుం జని రాజపుత్త్రులు గొందఱుతోడ రాలోనఁ బ్రవేశింప గుహాద్వారంబున నె శిలాతలంబున నధోముఖియై కూర్చుండి తరళిక తన శరీరంబు పట్టుకొనియుండ నిరంతరము నశ్రుధారలు గార్చుచున్న మహాశ్వేతం గాంచి చంద్రాపీడుండు తన చిత్తంబున నిట్లు తలంచెను. కాదంబరికే యనిష్టంబు ప్రాప్తంబై యుండ నగు, అట్లు గాదేని మహాశ్వేత కిట్టి యవస్థ యేల పొడము'నని యెంచి యాశిలాతలంబున నొక్కచో గూర్చుండి 'ఏమియిది? యని తరళిక నడుగ నది మహాశ్వేత ముఖంబు నవలోకించెను. అంత నాయమ గద్గద స్వరంబున నిట్లనియె.

"మహాభాగ ! ఏమని విన్నవింతు? నేను కేయూరకుని వలన నీవుజ్జయిని కరిగితివని విని చిత్రరథుని మనోరథంబును నాయిష్టంబును నెఱవేరదాయె'నని చింతించి వైరాగ్యంబున నతితపంబు సేయ నిశ్చయించి వచ్చి యిట రూపంబునను వయసునను నీకెనయగు బ్రాహ్మణకుమారుం గాంచితి. అతండు నన్నుఁ జూచి యపరిచితుండయ్యుఁ బరిచితునివలెను, దుఃఖించువాని వలెను, ఏమియో స్మరించు వాని వలెను రెప్పవేయక నన్ను గాంచి యిట్లనియె:—'సుతనూ! సకలమగు ప్రాణిజాతంబును జన్మంబునకు, వయసునకును, ఆకృతికినిఁ దగు నట్టు లాచరించుచు నింద్యత నొంద నేరదు. నీకిట్టి

యసదృశంబగు యత్నంబేల! నినుఁబోటి కన్యక మైహికసు
ఖంబులకు విముఖయై తపంబునఁ దనువల్లి నాయాస పఱుచు
నెడఁ గుసుమ కార్ముకుండు విల్లు పట్టుట వ్యర్థంబకదా? అను
టయు, నేను పుండరీకుని వృత్తాంతంబున నిరుత్సుకురాల నగు
టం జేసి 'నీవెవ్వండవు? ఇచ్చటి కేల వచ్చితివి? అని యడుగక
యే వేఱుచోటి కరిగి దేవతార్చన కుసుమమ్ములు గోయుచుఁ
దరళికతో నిట్లంటిని. 'తరళిక! ఈబ్రాహ్మణ కుమారుం
డెవ్వఁడు? ఈతని యభిప్రాయంబుజూడ వేఱుగాఁ దోఁచెడిని.
కాన నితం డిటకు మగుడ రాకుండునట్లు వారింపుము. నివా
రితుండయ్యు నిటకు వచ్చునెడ వానిక యప్రియంబు గలిగె
డిని' అన విని తరళిక వారించినను నతండు మదన దోషం
బుచేతనో, అనర్థంబు గానుండుటచేతనో, అనుబంధంబు విడువఁ
డాయెను. అంత నొక నాఁటి రాత్రి వెన్నెలఁ గాయుచుండఁ
గను, తరళిక నిద్రించుచుండఁగను, నే నీ శిలాతలంబునఁ బం
డుకొని పుండరీకునిఁ దలంచి 'మందభాగ్యనగు నాయభాగ్యం
బున దివ్య పురుషుని భాషితంబు నసత్యంబయ్యె. అమ్మహా
త్ముండు దయ దలఁచి యిదియెట్లో జీవించుత'మని యూఱ
డించి యుండును, అని తలంచుచు మేల్కాంచియే యుంటిని,
అప్పు డున్మాదంబున మత్తునివలె వచ్చిన యవ్విప్రకుమారుం
గాంచి భయపడి చిత్తంబున నిట్లు వితర్కించితి, అయ్యో?
కష్టంబు ప్రాప్తంబయ్యె, ఇతం డున్మదంబున నేతెంచి నన్నుఁ
బాణిచే స్పృశించినను నే నీశరీరంబు విడువవలసివచ్చును.
అప్పుడు పుండరీకుని దర్శనము గోరి చిరకాలంబుననుండి దుః

ఖంబుల సహించి ప్రాణంబుల ధరించుట వ్యర్థమేయగు'అని
యే నాలోచించుచుండఁగనే వాఁడు సమీపించి యిట్లనియె:-
‹చంద్రముఖి! చంద్రుండు కుసుమశరసహాయుండై నన్ను
వధింప నుద్యమించుచున్నఁవాఁడు. కాన శరణంబుసొచ్చితి.
ఆర్తుఁడనగు నన్ను రక్షింపుము. నన్ను శరీరదానంబున మన్నిం
పవేని హతునిగాఁ దలంపుము. అనుటయు'విని యేను శీఘ్రం
బ రోషానలంబుచేఁ గాల్చునట్లు వానిం గాంచి యిట్లంటిని.
‹ఆ! పాపా! నన్నిట్లు పలుకు నీతలపై పిడుగేల పడదు? నీనా
లుక వేవిధంబుల నేలచీలదు. నీతనువున శుభాశుభ సాక్షి
భూతంబులైన పంచ మహాభూతంబులు లేవని తలంచెద.'అవి
యుండునెడ నిట్లు పలుకు నిన్నునగ్నియేల భస్మంబుసేయదు?
వాయువేల గొట్టుకొనిపోదు? జలంబేల ముంపదు? పుడమి
యేల పాతాళంబు సేర్పదు? ఆకాశంబేల శూన్యంబు గావిం
పదు? చిలుకవోలె నెవ్వనిచే మాటలు నేర్పఁబడితివి? నీవట్టి
శుకజాతియందుఁ బుట్టి యుండితేని మముఁ బోంట్లంగామించి
మాకుఁ గ్రోధంబు గలిగింపకుందువుగదా? అనిపల్కి చంద్రా
భిముఖనై దోసిలియొగ్గి, పరమేశ్వర! లోకపాలులార! ఏను
పుండరీకునిఁ గాంచినది మొదలు మనంబుననైనన్యునిఁ దలం
పనైతినేని నప్పుడీ సత్యవచనంబున నితండేఁజెప్పిన జాతియంద
పడుగాత' మని యేఁ బలికినయనంతరమే యతండు మొదలు
దెగ గొట్టఁబడిన చెట్టువలె నిశ్చేతనుండై పుడమిపయిం బడి
యెను. అతం డట్లు నిర్జీవితుం డగుడు నాక్రందనంబు సేయు

నతని పరిజనులవలన నితండు మహాభాగుని మిత్రించెయని విని లజ్జించి కన్నీరు గార్చుచు నేడ్చుచున్నదానను. ”

అన విని చంద్రాపీడుండు గనుగవ మూసికొని భగవతి! నీవు యత్నించినను నాకీజన్మంబునఁ గాదంబరీ సమాగమ సుఖంబు ప్రాప్తింపదాయెఁ గాన జన్మాంతరమందైనఁ గలుగఁజేసెదుగాక, అని పలుకుచు గుండియ వగులుట న సువుల విడిచెను. అంతఁ దరళిక మహాశ్వేత శరీరంబు విడిచి చంద్రాపీడుని బట్టుకొని, భర్తృదారిక! చంద్రాపీడునిఁజూడ వేరువిధంబుగఁ దోఁచెడిని. కదలించినను గదలఁడు. కన్నులు దెఱువఁడు. నిట్టూర్పు విడువఁడు,, ‘హా! చంద్రాపీడ! కాదంబరీ ప్రియ! ఇప్పుడక్కాదంబరిని విడిచి యెటకేగెదవు? అని తరళిక దీనారావంబు సేయుచుండ, మహాశ్వేత నిశ్చేష్టితయై యుండ’ ఆ! మహాపాపా! దుష్టతాపసి! ఎంతపని చేసితివి? తారాపీడుని కులంబు నిర్మూలము సేసితివిగదా? అని రాజపుత్త్రిలు పలవించుచుండిరి. అప్పుడింద్రాయుధంబు చంద్రాపీడుని వదనంబునఁ జూడ్కినిడి యతిదీనంబుగ హేషారవంబు సేయుచుండెను.

అంత నక్కడ కాదంబరి చంద్రాపీడుండు వచ్చునని విని శృంగారవేషంబు దాలిచి పత్త్రలేఖ చెయిపట్టుకొని మదలేఖతో మహాశ్వేతాశ్రమంబునకుఁ జనుదెంచుచు ‘మదలేఖా! పత్త్రలేఖ యేమో చెప్పుచున్నది. ఏను విశ్వసింపను. ఒకవేళ నతండు వచ్చినను నేను చూడను. నీవు నన్ను ననునయింపవలదు. అని పలుకుచు నచ్చోటఁ జేరెను. వచ్చి జీవితరహితం

బై యున్న చంద్రాపీడ శరీరంబు గాంచుచునె తలవాంచి నేలపైఁబడుచుండ మదలేఖ కాదంబరిని పట్టుకొనియెను. అప్పుడు పత్రలేఖ కాదంబరిచేతినుండి చేయి విడిపించుకొని స్మృతిదప్పి పుడమిపైఁ బడియెను. కొంతసేపునకుఁ గాదంబరి తెలివినొంది నిట్టూర్పు విడువను మఱచి నిశ్చేష్టితయైయుండ మదలేఖ యార్తనాదంబు సేయుచుఁ బాదంబులపైఁబడి యిట్లనియె:—ప్రియసఖి! దుఃఖభారంబు విడువుము. బాష్పమోక్షంబున దుఃఖభారంబు విడువనిచో నధికజలంబునఁ బీడితంబైన తటాకంబు వడువున నీహృదయంబు వగిలెడిని. మదిరనుం జిత్రరథుని నపేక్షింపుము. నిన్ను విడిచి యూకులద్వయంబును జీవింపనేరదు సుమా? అని పలుకఁ గాదంబరి నవ్వి యిట్లనియె:—

ఓసి! ఉన్మత్తా! చూడఁగనే వేయితునుకలు గాని యీకఠినహృదయ మెట్లు వగులును? మఱి యెవ్వాత జీవించునో, దానికిఁ దల్లి, తండ్రి, సఖులు నిదియంతయుఁ గలదు గాని మృతినొందు నా కేల! ఎట్లో నాకుఁ బ్రియతమశరీరంబు దొరకెను. జీవించిన శరీరముతో నుపభోగ మొనర్చిననో, నిర్జీవమగు ప్రియశరీరముతో ననుమరణంబు సేసిననో సర్వదుఃఖంబులును శాంతించెడిని. కాన దుఃఖింపనేల? స్వర్గగమనోన్ముఖుండగు దేవునకు రోదనముచే నమంగళ మెట్లాచరింతును? పాదధూళివలె ప్రియపాదముల ననుగమించు నానంద సమయంబున రోదనము నేలసేయవలయు? ఎవ్వనికై కులక్రమంబు గణింపనైతినో, శిశిరోపచారములచే సఖీజనంబు నా

యాసపెట్టితినో, మహాశ్వేత కతంబునఁ జేసిన ప్రతిననుగూడ నుజ్జగించితినో, అట్టి ప్రాణేశ్వరుండు నాకయి ప్రాణంబులు విడువ నేను ప్రాణంబుల నెట్లు వహింతును? నీకు నాయందుఁ బ్రేమ యుండునెడ నాతలిదండ్రులు శరీరములు విడువనట్లు చేయుము. ఏను చంద్రాపీడుని కంఠంబుం గ్రహించి చితానలంబున శరీరంబు విడువంగల' నని పలుకుచుఁ దన్నుఁబట్టుకొని యుండిన మదలేఖను విదలించి మహాశ్వేత కంఠంబు గౌఁగిలించికొని నిర్వికారవదనయయి యిట్లనియె:—

ప్రియసఖి! నీకెట్టిదో యాశకలదు. దానిచేతన జీవించి యున్నదానవు. నా కట్టి యాశలేదు. కావున, మగుడజన్మాంతర సమాగంబునకై వేడెద, నని పలికి మరలివచ్చి శిరంబుచేఁ జంద్రాపీడుని చరణంబులకు వందనంబుచేసి యతని పాదంబులఁ దన యంకంబున నిడికొనియుండెను. అంతఁ గాదంబరీ కరతలస్పర్శంబుచేఁ జంద్రాపీడ శరీరంబుననుండి చంద్రధవళంబగు నొక తేజంబు వెలువడినట్లు తోచెను. అనంతర మంతరిక్షంబునుండి యశరీరవాణి వినవచ్చెను. "వత్సా! మహాశ్వేతా! ఇంతకుమున్ను నేన నిన్నూఱడించితిని. పుండరీకుని శరీరంబు నాలోకంబున నున్నది. చంద్రాపీడుని శరీరంబును శాపదోషంబున నాత్మచే విడువఁబడినను గాదంబరీ కరతల స్పర్శంబుచే నాప్యాయమానంబై యోగిశరీరంబునుంబోలె చెడక యుండును. మీనమ్మిగకయి శాపక్షయమగునందాఁక నిత్తునవంద యుండవలయు. జలమునందుఁగాని, యగ్నియందుఁగాని వేయక సజీవంబగునందాకఁ బ్రయత్నంబునఁ బాలిం

చుచుండవలయు.' అను వచనంబు నాలించి యెల్లరును గగన తలంబు గాంచుచుండిరి. అంత న త్తేజంబుచేఁ బత్రలేఖ తెప్పి రిలి లేచి వేగంబునఁ బరుగిడి యింద్రాయుధంబుం బట్టుకొని దేవుండు దూరం బరుగ నీవిచట నొంటిమెయి శోభింపవనుచు నింద్రాయుధంబుతోఁ గూడ నచ్ఛోదంబునం బడియెను.

---

## ద్వావింశ ప్రకరణము.

### కపింజలాది శాప వివరణము.

---

అనంతర మచ్ఛోదంబున నుండి యొక తాపస కుమా రుండు వెడలివచ్చి మహాశ్వేతంగాంచి 'గంధర్వ రాజపుత్త్రి! నన్నెఱుంగుదువా? అనుటయు మహాశ్వేత లేచి శోకానంద మధ్యవర్తినియై ప్రణమిల్లి 'భగవంతుఁడా! కపింజల! ఈయ భాగ్యను దలంపవైతివిగదా? పుండరీక శరీరంబు గొంపోయిన నారెవరు? ఏల కొంపోయెను? అతని వృత్తాంతమేమి? అతం డెందున్నవాఁడు? ఇందాఁకవార్తనైన నేలచెప్పవైతివి? నెచ్చె లిని విడిచి నీవొంటిమెయి నేల వచ్చితివి? అని యడుగఁ గా దంబరీ పరిజనంబును రాజపుత్త్రిలోకంబును నచ్చెరువునఁ గాంచుచుండఁ గపింజలుం డిట్లనియె;

'గంధర్వరాజనందన! వినుము. అట్లార్త ప్రలాపంబు సే యు నిన్నొంటిమెయి విడిచి వయస్యస్నేహంబున 'నాప్రియ

సుహృదు నెటకుఁ గొనిపోయె,దని యాపురుషు వెన్వెంట నరి
గితి. ఆపురుషుండు నాకు మాఱువల్కకయె చంద్రలోకంబున
కరిగెను. అచ్చట మహోదయం బను సభలోన నిందుకాంత
మణిమయంబగు గొప్ప పర్యంకంబునఁ బుండరీకశరీరం బునిచి
నాతో నిట్లనియె:—'కపింజల! నన్నుఁ జంద్రునిగా నెఱుం
గుము. ఏను జగదనుగ్రహంబునకయి యుదయించి నాకృత్యం
బు నిర్వర్తించుచుండఁ గామదోషంబున నీప్రియమిత్రుఁడు
నన్ను శపించెను. 'నీవు నన్నుఁ గరంబులచే సంతాప పఱిచి
ప్రియాసమాగమసుఖంబు నొందకమున్న ప్రాణవియుక్తుఁగా
వించితివి. కాన నీవును గర్మభూమియగు నీభారతవర్షంబునఁ
బ్రతిజన్మంబునను ననురక్తినొంది ప్రియాసమాగమ సుఖంబు
నొందకయ తీవ్రంబగు హృదయవేదన ననుభవించి జీవితంబు
విడిచెదుగాక!' నావిని యేను శాపాగ్నిచే మండిపడి యీని
ర్వివేకబుద్ధి నిరపరాధి నగు నన్నేల శపించె నని కోపించి 'నీ
వును నాకు సమంబుగ సుఖదుఃఖంబుల నొందు చుండెడ' వని
వానికిఁ బ్రతిశాపమిచ్చితి. కోపంబు దొలంగిన పదంపడియిట్లు
విమర్శించితి. 'మహాశ్వేత నాకిరణంబులవలనఁ గలిగిన యప్స
రసల కులంబున జన్మించిన గౌరియందుఁ బుట్టెను. అక్కన్య
తనంతన యితని భర్తనుగావరించెను. ఇతండు స్వయంకృతంబ
గుశాపదోషంబున మర్త్యలోకంబుననిరుమాఱుపుట్టకతీఱదు.
అట్లుగాదేని బ్రతిజన్మంబున ననుమాట చరితార్థంబు గానే
రదు. కాన యీశాపదోషంబు విడుచునంతకు జీవరహితం
బగునీశరీరంబునకు వినాశంబుగలుగకుండుత, మఱి యేఁ గొ.

వచ్చితి. మహాశ్వేత నూఱడించితి. ఈశరీరంబు నా తేజంబున నాప్యాయనంబు గొనుచుండును. నీ విపుడు చని యీవృత్తాంతంబు శ్వేతకేతున కెఱిఁగింపుము. అతండే దేవిఁ బ్రతిక్రియ సేసినఁ జేయంగలఁడు.' అని పలికి నాకు సెల వొసంగెను. ఏను వయస్యుని విడిచి శోకాంధుండనై చనుచు మార్గంబున నతికోపియగు నొక్క వైమానికు నుల్లంఘించితి. అతండు నన్నుఁ గాల్చువానివలెఁ గాంచి యిట్లనియె:— 'దురాత్మా! మిథ్యాతపోబలగర్వితా! గగనమార్గంబు విస్తీర్ణంబయియున్నను నీవు తురంగంబునుంబోలె నన్నతిక్రమించితివి. కాన తురంగమంబవై మర్త్యలోకంబున నవతరింపుము.' అన విని యేనశ్రుకన్నీరు గొలుకఁ దోసిలియొగ్గి 'భగవంతుఁడా! ఏను వయస్యశోకాంధుండనై నిన్నతిక్రమించితిగాని యవమానబుద్ధిచేగాదు. కాన శాపం బుపసంహరింపుము' నావిని యతం డిట్లనియె:—

'ఇచ్చిన శాపంబు తొలఁగింప వలనుపడదు. నీకిది కొంతకాలంబు మాత్రమె యుండునట్లు చేసెద. నీవెవ్వనికి వాహనంబ వగుదువో, వాని యవసానంబున స్నానంబుచేసి విగతశాపుండ వయ్యెదు.' అన విని యేనిట్లడిగితి. 'దేవ! అట్లైనను నామిత్రునితోడను, చంద్రునితోడను శాపదోషంబున మర్త్యలోకంబున నె జన్మించునట్లనుగ్రహింపవలయు,' ననవిని యమ్మహాత్ముండు ముహూర్తమాత్రంబు దివ్యదృష్టి నవలోకించి నాతో నిట్లనియె:—'ఉజ్జయినీనగరంబున సంతానార్థము తపంబు సేయు తారాపీడుం డనుభూపాలునకుఁ జంద్రుండుతనయుండై జన్మింపఁ గలఁడు. నీవయస్యుండగు పుండరీకుండును నాత

ని మంత్రియగు శుకనాసునకుఁ దనయుండగును. నీ వారాజ
నందనునకు వాహనత్వ మొందఁగలవు'. అనుటయు నంతట
నేను క్రిందనున్న సాగరంబునం బడితి. అటనుండి వారువంబ
నై వెడలితి. అశ్వజన్మంబునను నాకుఁ బూర్వజాతిజ్ఞానంబుగల
దు. దానని యిక్కార్యంబు నెఱవేర్పఁ గిన్నరమిథునంబు వెం
బడి యీప్రదేశంబునకు జంద్రాపీడుం గొనివచ్చితి. కాన యీ
చంద్రాపీడుండు చంద్రునియవతారము. మఱియుఁదొల్లింటియ
నురాగసంస్కారంబున నిన్నుఁగోరి, యెఱుంగని నీచే శాపా
గ్నిదగ్ధుండైన వైశంపాయనుండు పుండరీకుని యవతారము.'
అన విని మహాశ్వేత 'హా! దేవ పుండరీక! జన్మాంతరగతుండ
వయ్యు నాయం దనురాగంబు విడువవైతివా? నీవు లోకాం
తరగతుండవైనను నీప్రాణంబులకు నేన రాక్షసినై జన్మించితి.
ఆ విధాత్రుండు నన్నుఁ బుట్టించుటకును, నాకు దీర్ఘజీవితం
బొసంగుటకును నిన్ను పలుమాఱు హింసించుటయు ప్రయో
జనంబయ్యె. పాపకారిణి నేన నిన్నుఁ జంపుకొని యెవ్వని నిం
దింతు? ఎవ్వనికిఁ జెప్పుదు? ఎవ్వని శరణుఁజొత్తు? నన్నెవ్వఁడు
దయఁ జూచు? నని విలపించుచుండఁ గపింజలుం డిట్లనియె:—
'గంధర్వరాజపుత్రి! ఇందు నీ దోషం బేమి కలదు? శాప
దోషంబున మీయిర్వురకును దుఃఖంబు ప్రాప్తించెనని వచిం
చితిగదా? మఱియు మీరు చంద్రుని భాషితంబువినియుంటిరి.
కాన యిర్వురశ్రేయంబునకయి తపం బంగీకరించితివి. తపం
బున కసాధ్యం బేమి కలదు? అని బోధింపఁ గాదంబరి కపిం
జలుని తో నిట్లనియె:—

'భగవంతుఁడా! కపింజల! పత్రలేఖయు నీవును గొలఁదికాలము క్రుంకితిరిగదా? పత్రలేఖావృత్తాంతంబు దెలిపి యనుగ్రహింపుము. అని యడుగ నతం డిట్లనియె:— 'భగవతి! సలిలంబునఁ బ్రవేశించినపదంపడి వృత్తాంతంబు నేమియు నెఱుంగ. కాన చంద్రాపీడునియాత్మ యెందుండెనో? వైశంపాయనుని జీవం డెందు జన్మించెనో? పత్రలేఖవృత్తాంత మెద్దియో? సకలంబు నెఱుంగ శ్వేతకేతుని పాదమూలంబున కరుగుచున్నాఁడ'నని వచించుచు నెగసెను. అంత నందఱు నాశ్చర్యంబున నాకసంబు చూచుచుండఁ గాదంబరి మహాశ్వేతతో నిట్లనియె:—

'ప్రియసఖి! విధాత్రుండు చిరకాలమునకు నాకు నీతో సమానదుఃఖత నొసంగెను. ఇప్పుడు నిన్నుఁ బ్రియసఖియని పలుక లజ్జింపను. నీకును నేనిప్పుడు ప్రియసఖినైతి. కాన నాకిప్పుడు జీవితంబైనను, మరణంబైనను దుఃఖకరంబుగాదు. ఇందేది యావశ్యకమని యెవ్వరి నడుగుదు? ఇందెద్ది శ్రేయమో? నీవ యుపదేశింపుము.' అనుటయు మహాశ్వేత యిట్లనియె:— 'ప్రియసఖి! ప్రశ్నంబుతో నేమి? ఉపదేశంబుతోనైన నేమి? పుండరీకుని వృత్తాంతము కపింజలుని వలనఁ దెలిసెఁగదా? అప్పుడు దివ్యపురుషుని వచన మాత్రంబునను నేను దుఃఖంబు సహించియుంటిని. నీకు విశ్వాసస్థానంబగు ప్రియతమ శరీరంబు నీయంకంబున నుండఁ జింతతో నేమి? ఈశరీరంబు నిలిచియుండునందాఁక నన్యమేమి సేయనగు. అప్రత్యక్షంబులైన దేవతలును ప్రతిమలయందు నుపచరింపఁబడు

చుండ ప్రత్యక్షదైవంబగు చంద్రుని మూర్తి లభింప నేమి చెప్పవలయు?' నని పలుకఁ జంద్రాపీడ శరీరంబు నొక శిలా తలంబున నునిచి తాను స్నానంబు చేసి శుచియై యాశరీరమును బూజించెను.

అప్పుడు మదలేఖ యాశరీరంబు నవలోకించి కాదంబరితో నిట్లనియె:—'సఖీ! ఇత్తనువునకు వ్యాపారంబు లేదు గాని ముఖంబు శోభను వహించియేయున్నది. నావిని రాజపుత్త్రిలాశరీరంబు గాంచి కాదంబరి నుద్దేశించి 'దేవి! దేవుండపుణ్యుల మగు మమ్ముఁబాసి పోయినను నాతని మోము నమ్మిన్న చంద్రబింబంబునుంబోలెఁ బ్రకాశించుచుండుట నీప్రభావం' బని వచించి యామె ప్రేరణంబునఁ గృతాహారులైరి. కాదంబరీ మహాశ్వేతలును నాహారంబు గ్రహించిరి.

---

## త్రయోవింశ ప్రకరణము.

### ఆశ్రమ వాసము.

అట నుజ్జయినీ నగరంబునఁ దారాపీడుండు 'తన కుమారుండు రాఁదడవయ్యె'నని మహాశ్వేతాశ్రమంబునకు వార్తాహరుల ననిచెను. అంతఁ బెక్కుదినంబులు గడచినను పుత్త్రుని వార్త తెలియక విలాసవతి పరితపించుచు నవంతి నగర దేవతల నర్చింపనెంచి మాతృకాయతనంబునకుఁ జని 'దేవి! అదృష్టము ఫలించెను. దేవతలు ప్రసన్నులైరి. వార్తాహరులు వచ్చుచున్నా'రని పరిజనంబు వలన విని యానందబాష్పములు

గ్రమ్మిన దృష్టిచే దెసలంగాంచి వాఙ్మయంబున నా చెవిలోన నిట్టి యమృతంబు నెవరు నింపిరి! ఎవరు చూచిరి? అని యడుగుచునె చూచుచుండెను. అపుడు వార్తాహరులనుగాంచిపుర జనులు 'యువరాజు వచ్చుచుండెనా? ఎంతదూరమున నున్నవాఁడు? మీరుగంటిరా? వైశంపాయనుండు గలసెనా? అని యడుగుచున్నను మాఱు వల్కక నాసాగ్రంబున దృష్టి నునిచికొని సర్వదుఃఖంబుల కాస్పదులవలె వచ్చెడు లేఖ హారకులఁగాంచి విలాసవతి మాతృకాలయంబు మునిగిటిలోన నుండి వారలఁ బిలిపించెను. అప్పుడు తలంపకయ విలాసవతిని గాంచుటం జేసి దుఃఖావేశం బిమ్మడి యగుట నిర్జీవితులంబోలి యున్న వార్తాహరులం గాంచి కొన్నియడుగు లెదురేగి యిట్లడిగెను. 'భద్రముఖులారా! తొలుత నా కుఱ్ఱని వార్త తెలుపుడు. నాడెందంబు కంపించెడిని. కుమారుం గంటిరా? అని యడుగ వారలు ప్రణమిల్లి యిట్లనిరి. 'దేవి! ఏ మచ్చట సరస్తీరంబున యువరాజుం గంటిమి. తక్కుంగల వార్త త్వరితకుండు నివేదింపం గలఁడు; నా విని విలాసవతి కనుదమ్ముల నశ్రువులు గాఱ నిట్లనియె.

'దూరంబునుండియు సంతసంబులేని మీ రాకచేతను, ప్రతి లేఖలేని శిరంబులచేతను, ప్రయత్నంబున నశ్రుమోక్షంబు బిగఁబట్టు లోచనంబులచేతను తెలుపవలసిన దంతయు మీరె తెలిపితిరి. వాఁడింక నేమి చెప్పఁగలఁడు? హా! వత్స! జగదేకచంద్ర! చంద్రాపీడ! చంద్రానన! చంద్రశీతలప్రకృతీ! చంద్రాభిరామగుణ! ఏమిజరిగె? ఏలరావైతివి? అమ్మ! నిన్ను

విడిచి వేఱొకచో విలంబంబు సేయ'నని చెప్పి యుంటివే! ఇది
నీకుఁ దగునా? ఈవరుగునప్పుడ మగుడ బాలుని ముఖావలోక
నంబు దుర్లభంబని నాడెందంబునకె తోఁచె." యని విలపిం
చుచు మూర్ఛనొందెను.

అంత నివ్వార్త పరిజనంబు వలన విని తారాపీడుండు
శుకనాసునితోన యాఁడయేనుంగు నెక్కి యతివేగంబున
'ఇది యే'మను కలకల స్వనంబుతో జనంబులు పలుచుచుండ
మాతృకాలయంబునకుం జని విలాసవతిం గాంచి కన్నీరు
గార్చుచు గద్గద స్వరంబున నిట్లనియె:—'దేవి! నిజంబుగఁ
జంద్రాపీడునకు వేఱు విధంబగు నప్రియంబు ప్రాప్తించినను
నతనికై యిట్లు వైవశ్యంబు నొందనేల? మనము శుభకర్మం
బుల నింతమాత్రం బాచరించితిమి. ఇంత కెక్కుడు సుఖంబు
నకుఁ బాత్రులము గాము. గుండియ వ్రయ్యలు చేసికొనినను
నలభ్యంబు లభించునె? కుమారుని జన్మోత్సవంబు గంటిమి.
అంకంబున నిడికొని లాలించితిమి. దిగ్విజయంబు సేసి యరు
దెంచిన వానిం గౌఁగిలించితిమి. ఇంక వధూసమేతుఁడగు
వానిని రాజ్యంబునఁ బ్రతిష్ఠితుం జేసి తపోవనంబున కరుగవల
యునను నొక్క కోర్కె సమకూడదాయె. సకల మనోర
థంబుల బడయఁ గలుగుట యెంతటి పుణ్యవంతునకో గదా?
మఱియు నీ లేఖహారకులతోఁ గుమారుని సేవకుం డరుదెంచె
ననియు, వానికి సకలంబు దెలియుననియుఁ బరిజనంబువలన
వింటిని. కాన వానిమాట యాలించి పిమ్మట జీవితంబో,
మరణంబో, నిశ్చయింతము, అని పలుకుచుండ ప్రతీహారి త్వరి

తంబుగఁ ద్వరితకుం దోడ్కొని వచ్చి రాజునకుం గనఁబఱి
చెను. అంత భూకాంతుండు వానింగాంచి ‘భద్ర! కుమారుని
వృత్తాంతంబు చెప్పుము. వేగిరంబ రమ్మని వ్రాసి యనిచినను
నేల రాఁడాయెను. రానికారణంబైన నేల వ్రాసి యంపఁ
డాయె? అని యడుగ వాఁడరిగినది మొదలు క్రమంబుగఁ
జంద్రాపీడుని హృదయంబువగిలిన వృత్తాంతంబువఱకు నివే
దింప విని తారాపీడుం డార్త స్వనంబున వానితో నిట్లనియె:

భద్ర! విరమింపుము. ఈవు చెప్పవలసినది చెప్పితివి.
నేను వినవలసినది వింటిని. హా! వత్స! నీదు డెందంబు వగు
లుటం జేసి నీకు వైశంపాయనుని యందుఁగల ప్రేమంబు వెల్ల
డిచేసితివి. ఏము క్రూరులము. కఠిన చిత్తులము. ఈప్రాణం
బులు తమ యంతన చంద్రాపీడుని వెంబడి నరుగనేరవు, కాన
శుకనాస! మహాకాళదేవుని దేవళంబు సమీపంబునఁ జితం బే
ర్పంపుము. కంచుకులారా! అగ్ని ప్రవేశోపకరణంబులం గొని
రండు. ధనంబెల్ల విప్రుల కొసంగుడు.’ అని విలపించుచుండ
త్వరితకుండు ‘దేవ! నీవు డెందంబునఁ దలఁచినట్లు గాదు.
హృదయంబు వగిలినను యువరాజుశరీరంబు నాశ మొందదు.
కారణం బాలింపు’ మని సకల వృత్తాంతంబు నివేదింపఁ దారా
పీడుండు శుకనాసు నవలోకించెను. సుజనులు తాము దుఃఖి
తులయ్యుఁ దమ దుఃఖము దలంపక మిత్రదుఃఖము నడంప
యత్నింతురు. కాన శుకనాసుఁడు స్వస్థునివలెఁ దారాపీడు
నితో నిట్లనియె:—

‘దేవ! సకల పురాణముల యందును శాస్త్రముల

విసుచునే యున్నారము. భగవంతుఁడగు నారాయణుండును దశరథునకుఁ బుత్రుఁడై యుద్భవించెను. కాన మానవుల యందు దేవతల యుత్పత్తి యసంభావితము గాదు. మఱియు గర్భారంభ సమయంబున దేవరవారు విలాసవతి నోరఁ జంద్రుఁడు ప్రవేశించినట్లు కలఁగంటిరి. ఏనును స్వప్నంబునఁ బుండరీకంబు గనియుంటిని' కాన నిందు సందియము లేదు. అట్లు గాన దేవరవారు శాపావసానంబున వధూసహితుండై యరుదెంచిన పుత్రుని జూడఁ గలరు. వారల శాపంబు మన లకు వరంబయామె.'నన విని తారాపీడుండు 'మంత్రిముఖ్యా! నీచెప్పిన దంతయు నిజము. అయినను కుమారుని ముఖం బవ లోకింపక యిందు నేనుండఁజాల'నని శీఘ్రంబ ప్రయాణంబునకు నుద్యమింప రాజునందలి యనురాగంబునను, ఆశ్చర్యంబు జూడవలయునను కుతూహలంబువలనను గృహరక్షకులు గాక తక్కుం గల జనంబులెల్ల నుజ్జయిని నుండి వెడలిరి.

తారాపీడుం డట్లు వెడలి మహాశ్వేతాశ్రమంబుఁ జేరి విలాసవతితోఁగూడఁ జంద్రాపీడ శరీరంబుగాంచి యత్తనువు కాంతి మహితంబై యుంటకు నచ్చెరువంది, ఏమిట నుండిన నేమి? లేకున్న నేమి? ఏవఘువు కరతల స్పర్శంబునఁ గుమారుని తను వింద్రాఁక నాప్యాయితంబై యుండెనో, ఆ కన్యయె యతని పార్శ్వంబున నుండుగాక, అని వచించి యటనుండి వెడలి యందుఁ దనకు గల్పితంబగు నావాసంబునకుఁ జనక యాశ్రమంబు సమీపంబున నొక తీగ లతా మండపమునఁ గూర్చుండి రాజుల నెల్లరం బిలిచి యిట్లనియె.

ఏను శోకవేగంబున నిది యంగీకరించితినని మీరు తలంపం బనిలేదు. ఇక్కార్యంబు పూర్వచింతితంబ యగు. అని పల్కి సన్నిహితంబులైన నుపభోగసుఖంబుల విడిచి తపోవన దుఃఖంబుల నంగీకరించియుండెను. ఎటులన, హార్ద్రబుద్ధిని వృక్షమూలంబులయందును, పరిచిత జన స్నేహమును మృగముల యందును, ఆహారసౌఖ్యమును గందమూలముల యందును, జయేచ్ఛను పరలోకమునందును, సంక్రమింపఁ జేసికొని తపంబు గానరించుచు సాయం ప్రాతఃకాలములయందుఁ జంద్రాపీడుం గాంచుచు నందె వసించి యుండెను.

---

## చతుర్వింశ ప్రకరణము.

### శుకబంధనము.

---

మునివర్యులారా! కామోపహతచిత్తుండగు నప్పుండరీకుండు స్వయంకృతంబగు నవినయంబుననె దివ్యలోకంబున నుండి భ్రష్టుండై మర్త్యలోకంబునందు వైశంపాయన నామంబున శుకనాసుని తనయుండై జన్మించెను. అతండె మగుడఁగు పితుండైన జనకుని యూక్రోశంబు వలనను, మహాశ్వేత సత్య వచనంబు వలనను శుకయోని యందుఁబుట్టెను. అని జాబాలి మునీంద్రుండు పలుకుచుండఁగనె నిద్రించి మేల్కాంచిన వానికింబలెఁ బూర్వ జన్మోపార్జితంబులగు నెల్ల విద్యలును విస్పష్టవర్ణంబగు వాణియు, సర్వవిషయంబగు జ్ఞానంబును లభించెను. అప్పుడు జాబాలింగాంచి మెల్లన నిట్లు విన్నవించితి.

భగవంతుఁడా! నీయనుగ్రహంబున జ్ఞానంబు గలిగెను. పూర్వ బంధువులఁ దలంచితి. నాస్మృతి వినినంతన యెవ్వని హృదయంబు వగిలెనో, ఆతని జన్మంబు చెప్పి యనుగ్రహించుఁడు. ఏ వనితతోఁగూడి యుందునేని నాకుఁ దిర్యగ్జాతి వాసంబును దుఃఖకరంబు గాదు. అని విన్నవింప నమ్ముని కోపించి యిట్లనియె:—'దురాత్మా! ఇంకను చిత్త చాంచల్యంబు విడువవేల? ఆక్కాలె రావాయె. పోఁజాలినంతవాఁడవై నన్నడుగు' మని వచించుచు గోష్ఠిని చెదర విడిచిలేచెను.

అప్పుడు నేనిట్లు చింతించితి. మానవ జన్మంబె దుర్లభము. అందును బ్రాహ్మణ్యంబును, మునిత్వంబును, దివ్యలోకవాసిత్వము నానివి యలంకారములు. ఇట్టి యున్నత స్థానంబున నుండి స్వదోషంబుచేతన భ్రష్టుండనైతి. ఈతిర్యగ్జాతి నుండి యెట్లు లుద్ధరింపఁ బడుదునని చింతించుచుండ హారీతుండు వచ్చి 'తమ్ముఁడా! కపింజలుండు వచ్చెను, అని పలుకుచుండగనె దురాత్ముఁడనగు నే నమ్మహాత్ముఁ గపింజలుంగాంచి కన్నీరు గార్చుచుండ నన్ను నిరుగేల లేవనెత్తి వక్షంబునను శిరంబునను నునిచికొని యితరునివలె రోదనంబుసేసెను. అప్పుడీతనిం గాంచి యే నిట్లంటిని, 'సఖుఁడా! కపింజల! కూర్చుండుము. తాతపాదంబులకుఁ గుశలమా? నా వృత్తాంతంబు విని యేమనియెను? కోపించెనా? లేదా? చెప్పుము.' అని యడుగ నతం డిట్లనియె:—సఖుఁడా! నీ జనకునకుఁ గుశలము. అమ్మహాత్ముం డీ వృత్తాంతంబు దివ్యదృష్టిచే గాంచి ప్రతిక్రియకై కర్మ మారంభించెను. దాననే యేను తురంగభావంబు

నుండి విముక్తుండనై యమ్మహాసీయు పాదమూలంబున కరిగి భయంబున దూరంబుననె యుండ నన్నుఁ జేరువకుఁ బిల్చి యిట్లనియె:—‘వత్స! కపింజల! ఏనెఱిఁగి యుండియు నుత్పత్తి సమయంబుననె యాయుష్కరంబగు నిక్కర్మంబు నెఱ వేర్పకుండుట నిది యంతయు నాదోషంబెయగు, కాన నిది పరిసమాప్తి నొందు నంతకు నిచటన యుండుమని వచింప నం మంటిని. మఱియు నేఁడు ప్రాతఃకాలంబున నన్ను బిలిచి యిట్లనియె:—‘కపింజల! నీమిత్రుండు జాబాల్యాశ్రమంబుననున్న వాఁడు. జన్మాంతర స్మృతిని గాంచెను. కాన నీవిప్పు డచటికరిగి ‘వత్స! నాచేయు కర్మంబు పరిసమాప్తి నొందు నంతకు నచటన యుండు’మని తెలుపుమని యానతిచ్చెనని వచించి మరలి చనియె.

అంతఁ గొన్ని దినంబులకు నెగయుటకు శక్తిగలవాఁడనై యిట్లు చింతించితి. ‘ఇప్పు డరుగ శక్తుండనైతి. చంద్రాపీడు నుత్పత్తియెటనో యెఱుంగ. అమ్మహాశ్వేతయె యట నున్నదిగదా? ఏను నటకె చనియుందునని నిశ్చయించి యొక నాఁటి ప్రభాతంబున విహారంబు మిషచే వెడలి కేవలముత్తర దిశ నవలంబించి యరిగితి. కొలఁది దినములనుండియె నడక నభ్యసించుచున్నవాఁడనగుటఁ గొంచెము దూరంబరుగగనె యంగంబులు భంగంబు నొంది, బెట్టునిట్టూర్చుచు నొక నేరేడు చెట్టుమీఁద నిలిచి మెల్లన దిగువఁజేరి యధ్వశ్రమంబున నిద్రించి మేల్కాంచి చూచునంతలో విడిపించుకొన శక్యంబుగాని వలత్రాళ్లచేఁ గట్టఁబడి యుంటిని. ఎదుట రెం

డవ యముండో యనఁ దనరు పురుషుంగాంచి 'భద్ర! నీవె వ్వఁడవు? నన్నేల పట్టితివి? అని యడుగ వాఁడిట్లనియె:— 'ఏను జాతిచే మాతంగుండను. ఇటకు సమీపంబున మాస్వా మిగలఁడు. ఆయనకొక కూఁతురు గలదు. ఆకన్నియ కెవ్వండో 'జాబాల్యాశ్రమంబున నిట్టి శుకంబు గలదని తెలిపెను, దాన నామెకుఁ గౌతుకము గలుగుట నిన్ను గ్రహింప ననుబోంట్లు పలువు రనుపఁబడిరి. ఇప్పుడు నాపుణ్యంబుచేఁ బట్టువడితివి. నావిని యేను 'మంచివాఁడా! ఏను పూర్వ జన్మజ్ఞానంబు గల మునిని, నన్నీసంకటంబువలన నుద్ధరించెదేని నీకుఁ బుణ్యంబు గలుగును, ఇచటఁ జూచువారు లేరుగాన నన్నువిడిచినను నీకుఁ బ్రత్యవాయంబు లేదు. కాన నన్ను విడువుము. అని పలుకుచు వాని పాదంబులపైఁ బడితిని. అంత వాఁడు నన్ను గాంచి నగి యిట్లనియె:—ఓరీ! మోహాంధ! శుభాశుభ కర్మంబులకు సాక్షి భూతంబులగు పంచమహాభూతంబులు నీశరీరంబునందు లేవా? అవి గానవా? ఏను స్వామ్యాజ్ఞచేఁ గొనిపోయెద' నని నుడువుచు గొనిపోయి మాతంగ కన్యకకుఁ గనఁబఱిచెను. ఆదియు 'మంచిపని చేసితివని నన్నుఁ బట్టు కొని ఆ! పుత్రిక! లభించితివి. ఇప్పుడెక్కడకుఁ బోయెదవు? నీ కామచారిత్వము నడంతునని పల్కి యొక కొయ్యపంజ రమున నునిచి యిందుండుమని యూరకుండెను.

అప్పుడు చిత్తంబున నే నిట్లు చింతించితి. 'అయ్యో! సంకటంబునం బడితిని. ఏమి సేయుదు? దివ్యలోకంబుననుండి జాఱుటయు, మర్త్యలోకంబున జన్మించుటయు, తిర్యగ్జా

యందుఁ బడుటయు, మాతంగ హస్తంబు నొందుటయు, పం
జరబంధ దుఃఖంబు గాంచుటయు నిదియంతయు నింద్రియ
జయంబు లేమికి ఫలంబకదా? అనియెంచి మానము నవలం
బించి యాహారము గ్రహింపనైతి. అంత నాయతివ నన్నుఁ
జూచి యిట్లనియె:—'ఆకలి దప్పులు గల పశుపక్షులు ప్రా
ప్తించిన యాహారంబు గ్రహింప కుండుట సంభవింపదు. తిర్య
గ్జాతి యందున్న నీకభక్ష్యమేమి? ఇంతటి వివేకశాలివి యిట్టి
తిర్యగ్జాతియందుఁ బడ నర్హంబగు కర్మంబెట్లు చేసితివి? మునిజ
నోచితంబులగు ఫలంబు లేల భక్షింపవు? అనుటయు నేను
నద్దాని వివేకంబునకు విస్మయంబునొంది జీవితాశచే నాహారం
బియ్యకొంటిని. ఇట్లు గొంత కాలంబు గతింప నొక్కనాఁడు
నిదుర మేల్కాంచి చూచునంతకు గనక పంజరమున నున్న
నన్నును, ఇట్టి మాతంగ కన్యకను గాంచితిని, అంతలో నప్ప
క్కణంబు నమరపురీ సదృశంబగుటయుఁజూచి మాతంగ వస
తిలో వసించితినను దుఃఖంబు విడిచి యచ్చెరువున నిదియే
మని యడుగ నెంచు నంతలో నీ కన్యక నన్ను దేవరవారి
పాదమూలంబునకుం గొనివచ్చెను. తాన నది యెవరో?
తనకు మాతంగత్వమునేల కనఁ బఱిచెనో? నన్నేల బంధిం
చెనో? ఇచటి కేల కొనివచ్చెనో? ఎఱుఁగను.' అని వైశంపా
యనుండు వచింప నారాజచంద్రుండు ప్రతీహారిం బిలిచి మా
తంగ కన్యకను దోడ్కొని రమ్మని యానతిచ్చెను. అప్పు
డమ్మాతంగ కన్యక ప్రవేశించి యెదుట నిల్చుండియె ప్రాగ
ల్భ్యంబున నిట్లనియె:—'భవన భూషణ! రోహిణీపతీ! కాదం

బరీ లోచనానంద చంద్ర! ఇతండు వచింప మీయిద్దర జన్మ వృత్తాంతంబు నాలించితివి గదా? ఇతం డీజన్మంబునను దండ్రిచే నిషేధింపఁబడియుఁ గామరాగాంధుండై తండ్రియానతి నుల్లంఘించి వధూసమీపంబునకుఁ బ్రయాణంబగుట తాన చెప్పికొనియె. ఏ నీదురాత్ముని తల్లినగు సిరిని. ఇతండు వెడలుట నితని జనకుండు దివ్యదృష్టింగాంచ ‹కర్మంబు తుదముట్టునందాఁక నీకొమరుండు తిర్యగ్జాతి కంటెను నధోగతి నొందకుండునట్లు వీనిని మర్త్యలోకంబుననె బంధించి యునుచుము› అని నాకానతిచ్చె. కాన నితనికిఁ బశ్చాత్తాపంబు గలుగ నే నిట్లాచరించితి. ఇప్పు డాకర్మంబు పరిసమాప్తి నొందెను. శాపావసానంబు సమీపించెను. శాపాంతంబున మీయిద్దరకుఁ బరస్పర సమాగంబు గలుగవలయు. గాన నీయొద్దకు వీనిం గొనివచ్చితి. ఇందును లోకసంపర్క పరిహారంబునకై మా తంగజాతిని గనఁబఱిచితిని. కాన నిప్పుడు మీయిద్దరును జన్మజరావ్యాధి యుతంబులగు నీశరీరంబులఁ బరిత్యజించి యిష్టసమాగమ సుఖంబు ననుభవింపుఁ' డని పలుకుచునె యందఱు గాంచుచుండ పుడమినుండి గగనతలంబున కెగసెను.

అంతనమ్మాట వినగనె యాశూద్రక మహారాజునకుఁ బూర్వ జన్మ జ్ఞానంబు గలుగుటంజేసి మకర కేతుండు కాదంబరినిఁ బరమాస్త్రంబుగఁ జేసి జీవితాపహారణంబునకై యతని లోనఁ బ్రవేశించెను. దానంజేసి సకల బాహ్యకృత్యంబులను విడిచి కాదంబరినె ధ్యానించుచు మిత్రులతో మాటాడక,

సుఖంబును గోరక, దుఃఖంబునకుఁ దలంకక, మరణంబునకు వెఱవక, శరీరంబునను స్నేహంబు లేక వర్తించుచుఁ దనకుఁ బరిజనులు పలుదెఱంగుల శిశిరోపచారంబులు సేయుచున్నను గాష్ఠీభూత దేహుండగు నాతనికిం గామానలంబు పరిపూర్తి వహించెను. మహాశ్వేత యందలి రాగాతిశయంబుచే వైశంపాయనునకును గామాగ్ని ప్రజ్వలించెను.

---

## పంచవింశ ప్రకరణము.

### చంద్రపీడాది పునర్జీవనము.

---

ఆ సమయంబునఁ గామి జనంబుల నున్మాదము సేయుచు, మానంబు మాపి వేయుచు మనోభవోల్లాస కారియగు సురభి మాసంబు ప్రవర్తించెను.

అప్పుడు గాదంబరి తన డెందంబు పర్యాకుల మగుటం జేసి కామదేవుని మహోత్సవంబు గొప్ప యత్నంబున నెఱవేర్చి సాయాహ్నంబున స్నానంబుసేసి కామదేవు పూజ నిర్వర్తించి యద్దేవు నెదుటఁ జంద్రాపీడు నతి సురభిశీతలంబులగు జలంబులచే స్నానము సేయించి, హరిచందనం బలఁది, కర్పూర మయంబులు, కుసుమ మయంబులు నగు నాభరణంబులచే నలంకరించి యొప్ప వేషమ్మను మఱచి భావార్ద్రంబగు

దృష్టిచేఁ గాంచుచు, మహాశ్వేత జూచునోయని పలుమఱు దెసలం బరికించుచుఁ బరవశయై యేకాంతంబునఁ జీవించి యున్న వానింబలె గట్టిగఁ గంఠంబు గౌఁగిలించెను. ఆ కాదంబరి కంఠ గ్రహణంబుచేఁ జంద్రాపీడుని కంఠ స్థానము క్రమ్మఱ జీవితంబు గ్రహించెను. హృదయంబు శ్వాసంబు వహించెను. కనుగవ విచ్చెను.

ఇట్లు చంద్రాపీడుండు నిద్రించి మేల్కాంచి నట్లు సకలాంగంబులు కదలించి కంఠలగ్నయగు కాదంబరి నక్కునఁ జేర్చికొని భయంబున వడంకుచు గనుగవమోడ్చి విడువను, గ్రహింపను నేరకయున్న యన్నాతితో నిట్లనియె:- «భీరూ! భయంబు విడువుము. నీ వమృతంబునం బొడమిన యప్సరల కులంబునఁ బుట్టితివిగాన నీకంఠగ్రహంబుచేతనె తిరుగ జీవంబు గ్రహించితి. «తేజస్వియగు నీతనువు నశించునది గాదు. విశేషించి కాదంబరీ కరతల స్పర్శంబున నాప్యాయితంబగు' నని యేఁ జెప్పినమాట తలంచెదుగదా? ఈవు పాణిచేఁ దాఁకుచున్నను నిందాఁక జీవింపకుంటకు శాపదోషంబు నిమిత్తంబగు. అది యిప్పుడు వదలిపోయెను. శూద్రకాఖ్యంబగు శరీరంబు విడిచితి. ఈతనువునందు నీకు నాసక్తి గలిగెనని యిద్దానిం గాపాడితిని. కాన నీ కీలోకంబును «చంద్రలోకంబును భోగ్యంబులగును. మఱియు నీప్రియసఖియగు మహాశ్వేతకుఁ బ్రియతముండైన పుండరీకుండు నాతోన విగతశాపుండయ్యె" నని పల్కుచుండగనె పుండరీకుండు శుకశరీరంబు విడిచి చంద్రలోకవాసంబున లగ్నంబైన యమృత

పరిమళంబు వహించిన యంగంబులతోఁ దొల్లిటిచందంబునఁ గంఠంబున నేకావళిని వహించి కపింజలుని కరంబు పట్టుకొని యరుదెంచెను. అతనిం దూరంబుననె కాంచి కాదంబరి చంద్రాపీడుని వక్షస్థలంబు విడిచి తాన పరుగిడి మహాశ్వేత కంఠంబు గాఁగిలించికొని పుండరీకాగమన మహోత్సవంబు నివేదించునంతలోఁ బుండరీకుండు చంద్రాపీడుని వద్ద కరుదెంచెను. చంద్రాపీడుం డతనిం గంఠంబున గాఁగిలించుకొని యిట్లనియె.—

‘సఖుఁడ! పుండరీక! నీవు ప్రాగ్జన్మ సంబంధంబున నాకు నల్లుండవైనను, అనంతర జన్మంబునం గలిగినసుహృత్స్నేహంబున నాతోఁ గూడి యుండవలయు.’ అని చంద్రాపీడుండు పలుకుచుండఁగనె చిత్రరథ హంసులకు నీవృత్తాంతంబు నివేదింపఁ గేయూరకుండు హేమకూటంబున కరిగెను. అత్తఱి మదలేఖయుఁ బరుగిడుచుఁ బోయి మృత్యుంజయ జప పరుండగు తారాపీడుని పాదంబులపైఁ బడి ‘యువరాజు వైశంపాయనునితోఁ గూడ జీవించెననియత్యానందంబున బిగ్గరగాఁ బలికెను. తారాపీడుం డమ్మాట విని పరమానందంబున విలాసవతినిఁ బట్టుకొని యడుగులు దొట్రువడ నృత్తముసేయువానివలె నడచుచు శుకనాసునితో నచ్చటి కరుదెంచెను. అట్లు వచ్చి పుండరీకునితో గూడి యున్న చంద్రాపీడుంగాంచి శుకనాసునితో నిట్లనియె.

‘మంత్రిముఖ్యా! నేను భాగ్యవశంబునఁ దనయుండు మగుడ జీవించుట వలనం గలుగు నానంద మనుభవించితి’నని

పలుకుండ చంద్రాపీడుండు జనకుని పాదంబుల కెరగెను. అప్పు డు తారాపీడుండు 'పుత్త్రీ! నీ శాపదోషంబుననో, నాభాగ్యం బుననో జన్మించితివి గాన నేను నీకుఁ దండ్రినై' యనుచుండ విలాసవతి యతని మోమునను, చెక్కిళులను స్పృశించుచు ముద్దిడుకొని విడిచెను. అంతఁ జంద్రాపీడుండు శుకనాసునకుఁ బ్రణామిల్లి 'వీఁడ వైశంపాయనుఁ'డని పుండరీకునిఁ గనఁబఱి చెను. అప్పుడు కపింజలుండు శుకనాసునితో నిట్లనియె:— 'భగవంతుఁడగు శ్వేతకేతుం డిట్లు వార్త యనిచె. ఏ నీపుం డరీకునిఁ బెనిచితినెగాని కననైతి. నీకు వీఁడు కొమరుండై యుదయించెను. వీనికిఁ బ్రేమయు మీాయందు కలదు. కాన నితండు వైశంపాయనుండే,యని నిశ్చయించి, పరుండనియుపే క్షింపక వీని నవినయములనుండి పాలింప నలయు, వీని శాపం బు తొలంగినను నీపుత్త్రుండ యని యెంచి నాయొద్దకుఁ జేర్చి కొననైతి. నావిని శుకనాసుండు వినయావనమ్రుండగు పుండ రీకు నాదరించెను. ఇట్టి ప్రస్తావంబులతో నారాత్రి గడచెను.

---

## షడ్వింశ ప్రకరణము.

### —॥ వివాహము. ॥—

---

ప్రభాతంబుననె సకల గంధర్వబృందంబును వెంబడింప మదిరా గౌరులతోఁ గూడ చిత్రరథ హంసు లచ్చటి కరుదెం చి లజ్జితలగు కూఁతులం గాంచి యానందించుచు, నల్లుండ్ర

నవలోకించి మనంబుల మెచ్చుచు (దారాపీడ శుకనాసులతో సంబంధకోచితంబగు సంవాదంబు నెఱపుచుండనప్పుడు మహోత్సవంబు సహస్రగుణితంబై యుండెను. అప్పుడు చిత్రరథుండు తారాపీడు నవలోకించి (నిజ భవనంబులుండ నరణ్యంబున మహోత్సవం బేల సలుపవలయు? నని పలికి తారాపీడు ననుమతిం జంద్రాపీడ పుండరీకులను నిజ పుత్త్రికలతో గూడ హేమకూటంబునకుం గొనిపోయెను.

అంతం జిత్రరథుండు గాదంబరితోం(గూడ నిజరాజ్యంబు చంద్రాపీడున కర్పించెను. అట్లు హంసుండును మహాశ్వేతతోం(గూడం దనపదవి పుండరీకున కొసంగెను. ఆచంద్రాపీడ పుండరీకులుహృదయంబునకుః నచ్చినవనితలులభించినమాత్రన కృతార్థతనెంచి యితరంబు దలంపరైరి. అనంతర మొకప్పుడు కాదంబరి చంద్రాపీడుంగాంచి యిట్లనియె:—(ఆర్యపుత్త్ర! మన మందఱము మృతినొంది మగుడ జీవించి యొకరితో నొకరు గలసితిమి. కాని మనయందుం బత్రలేఖ కానంబడదు. దానివార్త నెఱుంగ; నావిని చంద్రాపీడుం డిట్లనియె:—లలనా! అది యిందెక్కడ నుండును? రోహిణి నాశాపవార్త విని యొంటిమై నీవెట్లు మర్త్యలోక దుఃఖంబు ననుభవించెద వని వగచి, ఏను వారించినను నాచరణసేవకయి ముందె మర్త్యలోకంబున జన్మించెను. ఇటనుండి యేను జన్మాంతర మొందం దాను శరీరంబు విడిచి క్రమ్మఱ జన్మింప నుద్యుక్త యగుటయు నప్పుడు నేనదలించుటంజేసి దేవలోకంబుననె యున్నది. కాన దాని నందె చూడంగలవు. అన విని కాదంబరి రో

హిణి యుదారతను మహానుభావతను, స్నేహాలతను, పాతి వ్రత్యమును దలఁచి డెందంబున నచ్చెరువొంది లజ్జించి క్రమ్మ ఱ నేమియుఁ బలుకదాయెను.

చంద్రాపీడుండు శ్వశుర గృహంబునఁ గాదంబరీ సమా గమ సౌఖ్యంబు ననుభవించుచుఁ బది దినంబులుండి శ్వశురుల యనుమతిని వెడలి తండ్రిపాదమూలంబున కరుదెంచి రాజ లోకంబు నాదరించి పుండరీకుని యందు రాజ్యభార మునిచి తలిదండ్రుల పాదంబులు సేవించుచు, ఒకప్పుడు జన్మభూమి స్నేహంబున నుజ్జయిని యందును, వేఱొకప్పుడు గంధర్వ రాజు నందలి గౌరవంబున హేమకూటంబునందును, మఱి యొకప్పుడు రోహిణీ బహుమానంబునఁ జంద్రలోకంబు నం దును విహరించుచుండెను. ఇట్లు చంద్రుఁడు కాదంబరితోడను మహాశ్వేత పుండరీకునితోడను, పుండరీకుండు చంద్రునితోడ ను గూడి యొకరి నొకరెడఁ బాయక యెల్లరు నెల్లకాలం బును నెల్ల సుఖంబుల ననుభవించు చుండిరి.

శి వ ము.

సం పూ ర్ణ ము.



